శ్రీ అరవిందయోగి

# సావిత్రి

నాల్గవ పుస్తకం

# యోగవిభూతి

అనుకృతి

శ్రీ శార్వరి

SAVITRI - Book 4 – YOGA VIBHUTI
(Original SRI AUROBINDO'S SAVITRI
Book VII – The Book of YOGA)

Trans-Creation
SRI SARVARI

Layout by VASILI VASANTHKUMAR

First Edition Sept. 83
Price Rs. 10-00





SARVARI PUBLICATIONS
Plot No 55, P & T Colony,
GANDHINAGAR,
HYDERABAD-500 380

Printed at
MASTER ART PRINTERS
1-1-694/2/A, Gandhinagar,
HYDERABAD-500 380

# 'సవితా పురస్తాత్'

డాక్టర్ అరిపిరాల విశ్వం

పుట్టినప్పుడే జీవి ఏదో కోల్పోతాడు. అప్పటి నించే వెతుకులాట. ఆ వెతుకులాటకి మరోపేరు సంకల్పం, కోర్కె. కోర్కెతోనే దుఃఖానికి నిర్వచనం. దుఃఖానికి నిర్వచనంగా మనుగడని లాగటం మామూలుతనం. అదేదో తెలీదు. కోర్కెనించీ కోర్కెకీ ప్రస్థానం చేస్తున్నప్పుడు గమ్యం చేరకముందు నడక కుంటుపడినప్పుడు, దుఃఖం అంచులు పొరలినప్పుడు, ఉదయించే మథనం పేరు ప్రశ్న మళ్ళీ ప్రశ్న నించీ ప్రశ్నకి నడుస్తుంది మానసిక ప్రస్థానం. ప్రశ్నకి సమాధానాల్ని వెతుక్కోవటం జ్ఞానం. ఈ జ్ఞానం జీవిని చేరవలసిన గమ్యాన్నిచేర్చే నమ్మకాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ మాత్రమేకూరుస్తుంది. ఈజ్ఞానమే అంతర్మథనంగామారి, క్రియాశక్తిగా తపస్సుఅవుతుంది.

ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులకు ఆవల ఆనందజ్యోతిలీల ఆవిష్కృతం అవుతుంది. అప్పుడే తెలుస్తుంది జీవికి యీసృష్టి సర్వమూ, ఆ విరాట్ విశ్వనారాయణుని చిదచిద్విలాసమని. బ్రహ్మవాదిగా తపస్వి అయిన జీవి, బ్రహ్మవేదియై సాఫల్యాన్ని పొంది అద్వయ తాదాత్మ్యానుభూతిని పొందుతాడు.

బ్రహ్మసూత్రాలకు చివర ఒక్కసూత్రం ఉంది. 'లోకవత్తు లీలా కైవల్యం' అని. 'సావిత్రి' అరవింద మహర్షి నిరంతర తపఃఫలం. ఈ సూత్రానికి అనుభూతి వ్యాఖ్యానమే సావిత్రి రచన.

బ్రహ్మవిద్యకే శ్రీవిద్య అని మరోపేరు. శ్రీ అంటే బ్రహ్మ. శ్రీ అంటే ఆత్మ. 'శ్రీ ఇతి బ్రహ్మ. శ్రీ ఇతి ఆత్మా.' అంటే ఆత్మ పరమాత్మల అనంతైక్య సంధానాన్ని కూర్చేవిద్య. ఆ విద్యకి బహిర్యాగము, అంతర్యాగము, రహోయాగము అని మూడు అర్చనా ప్రక్రియలున్నాయి. బహిర్యాగం అంతా బాహిరంగా చేసే నామ జప హోమ అర్చనాదులు. అంటే యంత్ర, మంత్ర, తంత్ర రీతిగా అఖండానంద సాదాఖ్య పరంజ్యోతిని శివశక్తి భావనగా పూజించటం. శ్రీచక్రాన్ని 'యః అండాండే—సః పిండాండే' అన్న భావంగా

బాహిరసృష్టికీ ఆంతరిక విశ్వానికీ – జ్యోతిరేకతానతా భావం – జ్ఞానపరంగా తెచ్చుకోవటం. రహోయాగంలో దేహంలోని – నవయోనుల్నీ (నవరంధ్రాలనీ) చక్రాలనీ, ధాతువుల్నీ, వాయువుల్నీ. ప్రాణాలనీ, తన్మాత్రల్నీ శ్రీ చక్రపురంగా భావించి, దేహాన్ని శ్రీ చక్రంగా దర్శించటమే జ్యోతిర్వేదం. తేజోమార్గం, సావిత్రీ మార్గం.

దశమయోని బ్రహ్మకుండము అనబడే బ్రహ్మరంధ్రం. పరంజ్యోతి–కామకలాఖ్యమై సహస్రారం అనబడే సదాశివ జ్యోతితో పరారమ్య స్థితిని పొందినప్పుడు సోమరసాఖ్య అమృతం అభివర్షిస్తుంది. ఆ జ్యోతి బ్రహ్మరంధ్రం నుండి పైకి ప్రసరించినప్పుడు మహాసమాధి వస్తుంది. సహస్రారమనే వజ్రయోనియందు చేరినప్పుడు సమాధి కలుగుతుంది. సమాధి అంటే భావాభావ విపర్ణితత్వం. దాన్నే 'భూమా' అంటారు. ''యత్ర నా ఽ న్యత్ శృణోతి, నా ఽ న్యాక్ కరోతి, నా ఽ న్యత్ పశ్యతి, నా ఽ న్యత్ విజానాతి తదేవ భూమా'' అని ఉపనిషత్తు. 'యోవై భూమా తదమృతమ్' అన్న శ్రుతిప్రమాణం చేత ఆ స్థితినే బ్రాహ్మీ స్థితి అని కూడా చెప్పవచ్చు.

'శ్రీ చక్రస్య వియచ్చక్రమితి'. శ్రీ చక్రానికి వియచ్చక్రమని నామాంతరం ఉంది. దీన్ని దహరాకాశజము, బాహ్యాకాశజమనీ అంటారు. బాహ్యాకాశజం అంటే పీఠాదులు, చక్రాదులు. దహరాకాశజము అంటే హృదయాకావకాశంలో భావించి అర్చించటం. సావిత్రిలో యోగ విభూతి ఇతివృత్తాన్వితంగా బాహ్యాకాశజమైన సంకేతం. తాత్త్వికంగా యోగవిభూతికి ఆలవాలమైన దహరా పూజనం. ఇలా అర్థం చేసుకోవాలి. దహరా పూజనమే ధ్యాన యోగం అవుతుంది. దాన్నే చర్చిస్తూ వామకేశ్వర తంత్రంలో 'ధ్యాన యోగేన చింతయన్ జప మాచరేత్' అని ఉంది. ఇదే రహోయాగం లేక ముఖ్య ప్రాణోపాసన. శ్రీ అరవిందులు దీన్నే Descent of the Supramental అన్నారు. ఆ అనుభూతినే, ప్రజ్ఞానఘన, ఆనందఘన, రసఘన ఇత్యాది పేర్లతో పిలుస్తారు.

ఈ ధ్యానంలో మొదట విశ్వా (జాగృతి) తైజస (స్వప్న) ప్రజ్ఞ (సుషుప్తి) దశల్ని దాటి నాల్గవ దశ అయిన **తురీయాన్ని** చేరటం జరిగినప్పుడ ఆత్మ చైతన్యం.

''శాంతం శివమద్వైతం చతుర్థం మన్యతే
సఆత్మా సవిజ్ఞేయః'' (మాండూక్య ఉపనిషత్.)

దాన్నే కైవల్యఉపనిషత్‌లో—

"త్రిషుధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యోవిలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః"

ఇదే సాక్షిచైతన్యలక్షణం లేక శుద్ధచైతన్యం. అదే తురీయం. 'సతాసోమ్యతదా సంపన్నోభవతి'. జీవైశ్వరైక్యం కలుగుతుంది తురీయంలో. అజ్ఞత-తమస్సు, మాయ—జీవలక్షణం, ప్రాజ్ఞత - తేజస్సు. బ్రహ్మ — ఆత్మలక్షణం.

సావిత్రి — సగుణ మాయా శబలిత రూపంలో ఆవరణ, విక్షేపాత్మకమైన జీవభ్రాంతి. సావిత్రి - జీవ ఆవరణ, విక్షేపాలను వదలి - ఆత్మప్రస్థానమైన బ్రాహ్మీ పరాస్థితిని అందుకోవటమే సావిత్రి. సావిత్రి అంటే జనయిత్రి. పరంజ్యోతి నిరాకార, నిర్గుణ, నిరంజన, నిర్వ్యాపారయై, నిష్కలయై, నిష్పందయై యున్నప్పుడు, 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' అని 'అసత్'గా ఉండెను. 'సదేవసోమ్యే ఇదమగ్ర ఆసీత్'. ఆపిమ్మట 'సత్' అయింది. ఆమె 'అజా'. 'అజామేకాం లోహితః కృష్ణ శుక్లాం'. సగుణయై, శక్తియై, ఇచ్ఛా, జ్ఞాన, క్రియాత్మికయైంది. ఇది తేజోమార్గంలో-ప్రథమ ప్రస్థానం.

''మాయా కార్యమిదం భేద మస్తిచేత్ బ్రహ్మ భావనం.
దేహోఽహమితి దుఃఖీచేత్ బ్రహ్మోఽహమితి నిశ్చను.''

(కృష్ణ—యజుర్వేద—తేజోబిందు)

దృశ్య భేదము మాయాకార్యము. మిధ్య. అభేదమునే బ్రహ్మముగానూహించాలి. దేహమే నేనని తలంచిన దుఃఖం. అట్లు తెలియుట విజ్ఞేయ లక్షణం తెలియలేక దుఃఖించుట అజ్ఞేయ లక్షణం. మొదటి 'అయమాత్మా బ్రహ్మేతివ్యజానాత్' అన్న ఆత్మ బ్రహ్మైక్యం. రెండవది జీవభ్రాంతి. మౌలికమైన అజ్ఞానము.

'యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిస్త్రీకస్య క్వ భోగభూః?
స్త్రియంత్యక్త్వా జగత్త్యక్తం, జగత్త్యక్త్వా సుఖీభవేత్.'

(సామ. శు.య. యాజ్ఞవల్క్య)

స్త్రీ వాంఛ కలవానికి భోగం, భోగకార్యమయిన దుఃఖం కలుగుతుంది లేని వానికి లేదు. చిత్తక్షయం వల్లనే అది సాధ్యం. అదే జగల్లీల.

'చిత్తం కారణమర్థానాం తస్మిన్సతి జగత్త్రియం
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం. తచ్చికిత్స్యం ప్రయత్నతః' (యోగశిఖా

చిత్తమే సర్వార్థములకూ హేతువు. అదియే జగత్తు. చిత్తం నశి జగత్తులేదు. దానికై ధ్యానం ఉండాలి. మూడవకన్ను అప్పుడే తెరువబడ తుంది. జ్యోతి దర్శనం అవుతుంది. అది అసలు సావిత్రి.

'జ్యోతిర్లింగం భ్రువోర్మధ్యే
నిత్యం ధ్యాయేత్సదాయతిః' (బ్రహ్మవిద్యా)

అట్టి ఆత్మకు బంధములేదు. సర్వముక్తి.

'దేహజాత్యాది సంబంధాన్ వర్ణాశ్రమ సమన్వితాన్
వేదశాస్త్ర పురాణాని పదపాంసుమి వత్యజేత్' (బ్రహ్మవిద్యా)

తాను బ్రహ్మమని ఎరిగిన వానికి తక్కిన వేనితోనూ ప్రయోజనంలేదు దేహ జాత్యాది సర్వసంబంధ బంధాలూ ఉండవు.

ఇదే సావిత్రి కథ. ఆత్మ జ్యోతి కథ. జీవుని భ్రాంతి కథ. జగత్తుకథ బ్రహ్మ కథ. సంగరాహిత్యం సందేశం. శుద్ధజ్యోతి, స్వయంజ్యోతి అయిన సావిత్రి మాయావరణవిక్షేపాన్ని యోగ విభూతితో గావించుకొనటం యి 'సావిత్రి'లో అంతరార్థం. అప్పుడే ఆత్మకు ఉపశాంతి ఇది సందేశం.

'నిరింధన జ్యోతి రివోపశాంతో
నచోద్విజే దుద్విజేద్య త్రకుత్ర ! (శుక్ల-యజు - శాట్యాయనీయ)

జగత్తు సత్యమంటే భయపడాలి. తన కంటె అన్యం కాదనుకుంటే నిరింధన జ్యోతి వలె శాంతుడై భయపడడు. మాయ బంధం, బ్రహ్మభావన మోక్షం యిస్తాయి.

'దేహాదీనాత్మత్వేనాభిమన్యతే
సోభిమాన ఆత్మనోబంధః' (కృ.య, సర్వసారోపనిషత్)

దేహాన్ని ఆత్మగా భావించే అభిమానమే బంధం. సావిత్రి భ విషయంలో, జీవనైసర్గిక భ్రాంతిని పొందింది. దాన్ని 'యముడు' తొలగిం

పాడు. అంటే యమ నియమాది యోగానుసరణం అన్నమాట. యోగము చిత్తవృత్తి నిరోధం చేస్తుంది. సావిత్రి కథలో 'యముడు' యోగ విభూతికి తార్కాణ.

సావిత్రికి 'నాది' అన్న భావన కల్గించి భర్త్ర విషయంలో. ఆ సంకల్పమే బంధం. అదే యమపాశం.

'సంకల్ప మాత్ర సంభవో బంధః' (నిరాలంబోపనిషత్)
'నిత్యానిత్యవస్తు విచారాత్ అనిత్య సంసార సుఖదుఃఖ విషయ
సమస్త క్షేత్రమమతాబంధక్షయో మోక్షః' (నిరాలంబ)

మమతాబంధ క్షయమే మోక్షము. సావిత్రికి 'యముడు' తెలిపినది అదియే.

'మమేతి బధ్యతేజంతుః నిర్మమేతి విముచ్యతే
మమత్వేన భవేజ్జీవో నిర్మమత్వేన కేవలః' (యోగ చూడామణి)

జీవిని మమత కట్టేస్తుంది. నిర్మమత విముక్తుణ్ణి చేస్తుంది. మమత జీవ లక్షణం. నిర్మమత్వం కేవలత. బ్రాహ్మీస్థితి.

జీవియొక్క ఆచరణీయధర్మమే సత్యము. ఆ సత్యము త్రికాలా బాధ్యము. అది దాని అసలు స్థితి. మృతికి పూర్వమున్న సత్యవంతుడు లౌకిక సత్యానికి ప్రతీక. చిరంజీవియై మరల ఆవిష్కృతమైనప్పుడు అలౌకిక సత్య స్వరూపుడు.

జీవిని(సావిత్రిని)లౌకిక సత్యాలు బంధాలు వేస్తాయి. చిత్తాన్ని వ్యగ్రం చేస్తాయి, మమతాబంధాల్ని వేస్తాయి. యమనియమాదులచేత ఆ బంధాలు మృతిని పొందుతాయి అదే చిత్త వృత్తినిరోధం. యోగం. ఇక్కడ 'యమ' శబ్దం – గురు, యోగ, పథ సూచకం.

సావిత్రి - ఇతివృత్తరీత్యా బహిరాకాశజమైన అర్చనలో – త్రిపుటి భేదం చేయలేకపోయింది.

అందుకే జగన్మాతని 'బహిర్ముఖ సుదుర్లభా యైనమః' అన్నారు లలితా సహస్రంలో.

తనని తాను తెలుసుకోలేని జీవుడు ఈషణత్రయాన్ని పాశంగా చేసుకొని, పశువై బంధితుడౌతాడు. సావిత్రి అనే జీవి, కథలో ఈషణకు ప్రతీక

మైన భర్తృగతోపాసనం చేసి, తనకంటె మరొకటి కలదన్న భ్రాంతిలో 'పశు' లక్షణంతో రహించింది.

'అథయోఽన్యాం దేవతా ముపాసతేఽన్యో సావన్యోఽ హమస్మీతి
న సవేద యథాపశుః' (బృహదారణ్యక)

తాను బ్రహ్మమని తెలియక, అన్యదేవత నుపాసించువాడు పశువు.

'అత్రభిదామివపశ్యమానః శతధా సహస్రధా భిన్నో
మృత్యోస్సమృత్యు మాప్నోతి' (అథర్వణ-నృసింహోత్తరతాపినీ)

స్వజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేని బ్రహ్మని, ఎవడు జగజ్జీవేశ్వర భేదంగా తలుస్తాడో – అట్టివాడు శతధా, సహస్రధా మృతు డౌతాడు. సావిత్రి పొందిన భ్రాంతిలోని వేదనయే - సత్యవంతుని మృతి.

ధ్యానము చేత జీవుడు తమస్సులోంచీ జ్యోతిలోకీ – మృత్యువులోంచీ అమృతత్వానికీ ప్రస్థానిస్తాడు. ఈ రహస్యాన్ని స్వానుభూతి పురస్సరంగా తెలుపుటయే అరవిందుల 'సావిత్రి' యొక్క దహరా పూజన రహస్యం. ఈ రహస్యాన్ని ధ్యానబిందూపనిషత్‌లో వివరించటం జరిగింది. అదియే ప్రణవ పూజ. ఓంకారధ్యానం. నాద. బిందు, కళాత్మకంగా.

'అష్టాంగంచ, చతుష్పాదం త్రిస్థానం, పంచదైవతం
ఓంకారం యోనజానాతి బ్రాహ్మణోనభవేత్తుసః' (ధ్యానబిందు)

ఓంకారానికి విశ్వ, తైజస, ప్రాజ్ఞ, విరాట్, హిరణ్యగర్భ, అంత ర్యామి, కూటస్థ, పరమాత్మలు ఎనిమిదీ అంగాలు, అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు నాలుగు పాదాలు, జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మూడుస్థానాలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, రుద్ర సదాశివులు పంచదైవతాలు. ఇది ఓంకార స్వరూపం. దీన్ని జపించని వాడు బ్రహ్మవేత్త కాలేడు.

ఉపాధి భేదములచేత నేను, నీవు, వాడను భేదము లాత్మకి కలుగుతాయి. ఉపాధులు విడిస్తే అంతా బ్రహ్మమే.

"ఆవయోరంతరం న విద్యతే త్వమేవాహమహమేవత్వం"
(అథర్వణ - మహానారాయణ)

సావిత్రిలోని అంతరార్థం ఇదే. ఇతివృత్తం, తత్త్వం, యోగాను భూతి, అన్నీ అసలు వెలుగువైపు పయనించే వివరం. ఇట్టిజ్ఞానమే ప్రజ్ఞానము.

'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్న మహా వాక్యంలోని అంతరార్థమే సావిత్రి.

'యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞా న మీరితం.

(కృ. యజు-శుకరహస్య)

సంవిద్రూపమైన చైతన్యమే అంతఃకరణవృత్తులతోగూడి బాహ్యేంద్రియాల ద్వారా వ్యాపించి ఆ యా విషయాల్ని తెలుసుకొంటోంది. ఆ తెలివియే ప్రజ్ఞానం. అదియే 'తత్త్వమసి' మహావాక్యానికి అద్వైతానుభూతిని ప్రసాదిస్తుంది. ఇదియే హంసతత్త్వం. అజపా గాయత్రీ. ప్రాణ సావిత్రి.

'సకారోధ్యాయతే జంతుః హకారోహి భవేత్ ధ్రువం'

(సామ — యోగచూడామణి)

జీవుడు భ్రమర కీటక న్యాయంతో సకారశబ్ద వాచ్యుడై ధ్యానిస్తూ—
ఆ కారణం చేత 'హ'కార శబ్ద వాచ్యమైన బ్రహ్మ అయిపోతాడు.

'భోగైకవాసనాం త్యక్త్వా త్యజ త్వం భేదవాసనామ్
భావాభావౌ తతస్త్యక్త్వా నిర్వికల్ప స్థిరోభవ.' (సామ.మహా)

సావిత్రి ఇతివృత్తగతంగా జీవచాంచల్యపరమైన భోగైక వాసనా, భేద వాసనా అన్న మాయచేత వికల్పాన్ని పొందించి. భర్తృగత సుఖేచ్ఛ ఇక్కడ భోగైక వాసన. తానువేరు. అనుభవవిషయమువేరు అన్న భావన భేదవాసనా జన్యము. భావాభావాలను నివర్జితం చేసినప్పుడే నిర్వికల్పత. అదే స్థాయీభావం. బ్రహ్మ భావన. యమ నియమం చేత ఆత్మయే బ్రహ్మ 'అయం ఆత్మా బ్రహ్మేతి వ్యజానాత్' అన్న అనుభూత సమాధి - లేదా అద్వైత సిద్ధి కలుగుతుంది.

"పూర్ణ మద్వయ మఖండ చేతనం విశ్వభేద కలనాది వర్జితం,
అద్వితీయపర సంవిదంశకం తత్సదాహమితి మౌనమాశ్రయ."

(కృష్ణ.యజు, వరాహ)

'అఖండచేతన' అన్నపదం 'Integrated consciousness' అన్న అరవిందభావనకు పునాది. అద్వితీయ పరిపూర్ణమైన బ్రహ్మమేనేనని సంకల్పం చేక అచలుడై ఉండుటయే దివ్యజీవనం (Life-Divine). సావిత్రి చరమ

స్థితిలో యీ తేజో మార్గం. సావిత్రి పరమహంస పరివ్రాజికయై ప్రస్థానాంతంలో భాసిస్తుంది.

'బ్రహ్మైవాహమస్మీత్యనవరతం బ్రహ్మప్రణవసంధానేన
కృతకృత్యోభవతి సపరమహంస పరివ్రాట్'

(అథర్వ – పరమహంస పరివ్రాజక)

బ్రహ్మమే నేనని, బ్రహ్మప్రణవానుసంధానం చేసి, ఎవరు కృతకృత్యుడౌతాడో అతడు పరమహంస పరివ్రాట్. యముడు ఇక్కడ సావిత్రి చేత బ్రహ్మప్రణవానుసంధానంచేయించి, కృతకృత్యురాలనుగా చేస్తాడు. ఇది యోగవిభూతి రహస్యం. సంకల్పం మనస్స్వరూపం. సృష్టి విష్ణుస్వరూపం. కాలం మృత్యు స్వరూపం. యోగం చేత బ్రహ్మభావనచే యీ మూడింటినీ చంపితే —అఖండ చైతన్య శుద్ధజ్యోతి (సావిత్రి) నిష్కలమై, నిష్పందమై, నిశ్చలమై గోచరిస్తుంది.

'భావాభావ కళానిర్ముక్తః సర్వసంశయ ధ్వంసకః
పూర్ణాహంభావః కృతకృత్యో భవతి.'

భావాభావ కళలు లేక, సర్వసంశయధ్వంసకుడై, పూర్ణబ్రహ్మ నేనను వాడు కృతకృత్యుడగును. భావకళలు, అభావకళలు అంటే అంతఃకరణ వృత్తులు. అంతకరణవృత్తుల నించీ నిర్ముక్తం కానిదే అఖండ చైతన్య పరాభావన అంకురించదు. అదే అరవిందుల దివ్యజీవన సిద్ధాంతం (Life-Divine) ధ్యాన యోగంలో దీన్నే వృత్తి నిలపటం అంటారు. ఇక్కడ వృత్తి అంటే పూర్ణాఖండ బ్రహ్మజ్యోతి. అది అసలు సావిత్రీ ప్రస్థానం లేదా సత్య సావిత్రీ ప్రస్థానం. ఇదియే నిర్వికల్ప చిన్మాత్రవృత్తి. అదే జీవన్ముక్తస్థితి.

'రాగ ద్వేష భయాదీనాం అనుచరన్నపియోంత
ర్వ్యోమవత్స్వచ్ఛః సజీవన్ముక్త ఉచ్యతే' (కృష్ణ.యజు.వరాహ)

పైకి రాగద్వేషాదులున్నట్లు చరిస్తున్నా, లోపల నిర్మలాకాశం వలె స్వచ్ఛంగా, శాంతంగా ఉన్న జీవి జీవన్ముక్తుడు. చివరికి "సావిత్రి" యీస్థితినే అందుకుంటుంది. అప్పుడు ఆత్మ-తన అసలుస్థితిధ్యానంచేత అందుకుంటుంది.

'సర్వ ప్రకాశరూపోస్మి చిన్మాత్ర జ్యోతి రస్మ్యహం
కాలత్రయ విహీనోస్మి కామాది రహితోస్మ్యహం'. (సామ. మైత్రేయ)

కాలత్రయ భావనారాహిత్యం ధ్యానంలో మొదటిమెట్టు. కామాది రాహిత్యం (మనోరాహిత్యం) రెండోమెట్టు. ఆ స్థితినందుకొన్నప్పుడు ఆత్మ సర్వ ప్రకాశరూపమై, చిన్మాత్ర జ్యోతి అవుతుంది అట్టి చిన్మాత్రజ్యోతియే సావిత్రి. సావిత్రి ఓ రకంగా జగన్మాత. శ్రీ చక్రమహామండలేశ్వరి. శ్రీ అంటే ఆత్మ, శ్రీ అంటే బ్రహ్మ అని సర్వమూ తానైన తురీయాతీత, శాంత్యతీత పంచకళాత్మిక శుద్ధసత్త్వ యోగమాయా పరంజ్యోతి.

సావిత్రీ—సకల జగతః ప్రసవితృత్వాత్ సావిత్రీ.

'Savitri is represented in this poem as an incarnation of the Divine Mother ' Aurobindo. Letters on Savitri. 1936. p. 729.

సావిత్రి జగజ్జనని యొక్క అవతారం. లోకం సర్వం ఆమె లీలా కైవల్యం, మాయాశబలితమైన జీవలక్షణం – ఆత్మలోతుల్లోకి తిరిగి ప్రస్థానం చేయటం.

'చీకటి ఆత్మ గుహలో ఆశ్రయం పొందిన తాపసికి
నిర్జనారణ్యంలో మానవ స్వరాలు వినిపించవు'

'The ascetic's exile in the dim-souled huge
Inhuman forest far from cheerful sound.

ధ్యానస్థితిలో యోగికి ఆంతరికంగా దృశ్యమానమయ్యే దృశ్యపరం పరలో 'మహానీల స్థితి' ఒకటి.

'మొదట వినీల గగనం క్రింద ఆశ్రమజీవనం' 'At first to her beneath the sapphire heavens' దీన్నే 'నీలం మహోథావత్రి' అని ర్ణించారు ఋషులు.

యోగి ధ్యానంలో – ఆంతరిక జ్యోతిష్పథంలో ఓంకారం యొక్క శవిధ నాదాలను వింటాడు.

'అక్కడ వీచే గాలులలో సంగీతం వినిపించింది'

'There was a chanting in the casual wind.'

'వేణు, వీణా' నాదాలు ఓంకార ప్రస్తారంలో ధ్యానయోగంలో విదితమే.

'ఆ భయంకరమైన ఉరుములు, మెరుపులు,
ఆ పైన కుండపోతగా కురిసిన జలధారలు'

'And throngs of blue-black clouds crept through the Sky
And rain fled sobbing over the dripping leaves'

దశవిధ ఓంకారనాదాల్లో చివరిది మేఘగర్జనం. ఆ పైన అమృత వర్షిణి యైన సమాధి.

'ఏవో మెరుపులు మెరిసినా, పరమాత్మ స్వరూపం అందదు'

'A glimpse or flashes came, the Presence was hid'

ధ్యాన మార్గంలో సౌవర్ణ సౌందర్య సౌదామినీ దర్శనం కావటం ఒక స్థాయి. కాని అంతటితో ధ్యానం పూర్తి కాదు. జ్యోతి దర్శనంతో తృప్తి పడితే, పరమాత్మ దర్శనం అయినట్లు కాదు. ధ్యాని నిరంతర ప్రస్థానంలో ముందుకు సాగిపోవాలి.

'రెండు జీవులు ఒకటి కావాలన్న తహతహ
ఒకే జ్వాలలో రెండుశరీరాలు దగ్ధం అవుతున్న తపన.'

'A rushing of two spirits to be one losing of entities
A burning of two bodies in one flame'

దేహానికీ, దేహానికీ మధ్యగల ఆకర్షణయే ప్రేమ. అయితే ఇక్కడ సావిత్రీ, సత్యవంతుల ప్రేమని ఆంతరిక ప్రాణవిద్యలో ప్రాణ, అపాన వాయువులు రెండూ కలిసి ఇడా, పింగళా మధ్యగత సుషుమ్నా ద్వారంలోంచి ఊర్ధ్వగమనం చేసినప్పుడు-

'మరుపలేని మహానందద్వారాలు తెరుచుకున్నాయి'

'Opened were gates of unforgettable bliss'

కుండలిని లేక కులయోషిత లేక కామకల సుషుమ్నాంతర ప్రస్థానం చేయటం అనే ధ్యానస్థితి యీ పంక్తుల అంతరార్థం. సమాధి ఆరంభ సమయంలో జరిగే రసాస్వాద స్థితిని ఇక్కడ చెప్పటం జరిగింది.

'సమాధ్యారంభ సమయే సవికల్పకానందాస్వాదనంవా'.

(వేదాంతసార–సదానందకృత)

అయితే గౌడపాదకారికలో లయయోగాన్ని చెబుతూ

"లయే సంబోధయేత్ చిత్తం విక్షిప్తం శమయేత్ పునః
సకాషాయం విజానీయాత్ శమప్రాప్తం న చాలయేత్
నాస్వాదయేద్రసం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్'

చిత్తం లయలో ఉంటే ఉద్బుద్ధం చేయాలి. విక్షిప్తమైతే శమాత్మకం చేయాలి మరల. చిత్తం వృత్తిలో పడితే, తిరుగుతూంటే — ఒక చోటే నిలుపు. శమప్రాప్తి జరిగితే (వృత్తి నిలిస్తే) దాన్ని కదిలించకు.

సావిత్రీ సత్యవంతుల ప్రేమైక జీవనం సవికల్ప సమాధికి సంకేతం. అందులో వచ్చే విఘ్నాలు ఇందు అంతర్నిహితాలే. సావిత్రి పడే భ్రమలన్నీ అందుకు నిదర్శనాలే. సావిత్రీ సత్యవంతుల ప్రేమజీవితం - వృత్తుల్లో తిరిగే మనస్సు లక్షణం. అశాశ్వతాన్ని, శాశ్వతమని భ్రమించటం మనసు లక్షణం.

అందుకే ఆమె — ఆత్మ అద్వైతపరం — కానీ
"మనిషిగా జన్మించి కాలంతో ముడివడిన కారణంగా
దేవతలవలె ఆత్మకు చావు లేకపోయినా
కాలం కర్మం కొట్టే దెబ్బలకు గురి అయింది" జీవి అయి.

అందుకే సావిత్రికి-

'ఆత్మ ఎక్కడో దాగి ఉంది వెలుగు కనిపించటం లేదు
మరచి పోయిన ఔన్నత్యాలవాణి వినిపించటంలేదు.'

ధ్యానంలో - నాభిస్థానాన్ని (మణిపూరాన్ని) బ్రహ్మగ్రంధి — హృదయాన్ని విష్ణుగ్రంధి—భ్రుకుటిని రుద్రగ్రంధి అంటారు. మొదట వెలుగు భ్రుమోర్మధ్యంలో జ్యోతిర్మై దర్శనమిస్తుంది. ఆ పిమ్మట దహరాకాశంలో. అటు పిమ్మట నాభిస్థానంలో. ఆ తర్వాత శరీరమంతా. ఇలా ఉంటుంది ప్రస్థాన త్రయం. హృదయస్థానంలో కుండలిని ప్రయాణమప్పుడు ఉద్వేగాలు కలుగుతాయి. మణిపూరం దగ్గర అష్టసిద్ధులూ లభిస్తాయి. భ్రుమోర్మధ్యంలో 'ప్రజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్' అన్న స్వానుభూతి కలుగుతుంది. ప్రేమ హృదయ సంబంధి అంటారు కదా.
కొంత సాధన తర్వాత

'ఇచ్ఛాజ్ఞానం ఏకమయే భ్రుకుటికిపైగా
మహత్తర దివ్యవాణి వినిపిస్తుంది.

అదే మూడవకన్ను. రశ్మినేత్రం. ఆత్మ ప్రబోధం చేస్తుంది.

"నీవెందుకు జన్మించావో తెలుసుకో.
నీ ఆత్మను తెలుసుకో, నిగూఢ ఆత్మశక్తిని గ్రహించు.
నిశ్శబ్ద ప్రశాంతిలో భగవంతుని లక్ష్యాన్ని గుర్తించు.
అప్పుడు నీ భౌతికత దివ్యత్వంగా మారుతుంది.
భగవంతుని మందిరద్వారాలు తెరిచి సమాధిలో ప్రవేశించు.
నీ నుండి ఆలోచనలు దూరం చేసే వెలుగును దర్శించగలవు".

ఇది అంతరాత్మ అయిన దివ్యవాణి ప్రబోధం.

ఆవరణ విక్షేపాలు మాయలక్షణాలు. అవే తెరలు.

"ఆత్మ దృష్టికి అవరోధంగా ఉన్న తెరల్ని తొలగించుకో.
నీ మనస్సుమహాశూన్య స్థితిని చేరుకున్నప్పుడు
ఈ ప్రపంచంలో పరమాత్మ రూపాన్ని దర్శించగలవు.
నీ ఆత్మ వినగలిగిన అన్ని శబ్దాలలో పరమాత్మను తెలుసుకో"

దశవిధ ఓంకారనాదాలు వినటం ధ్యానంలో ఒకస్థితి. 'ఓమిత్యే కాక్షరం బ్రహ్మేతి వ్యజానాత్' అని తెలియటం ప్రజ్ఞాన ఘన స్థితి. అనుభవించటం ఆనందఘన అందులో కరిగిపోవటం 'రసఘన'. దాన్నే సచ్చిదానంద స్థితి అంటారు

'ఒక వృక్షం మొత్తం దాని బీజంలో నిక్షిప్తమైనట్లే
సృష్టిలోని సంభవాలన్నీ మనిషిలో దాగి ఉన్నాయి.'

'అహం వృక్షస్య రేరివ'

'యథావృక్షాణాం సమష్ట్యభిప్రాయేణ
వనమిత్యేకత్వవ్యపదేశోయథా' (వేదాంతసార)

విత్తులో చెట్టు ఉంది. చెట్టు చేత వనం భాసిస్తుంది. వనంచేత ప్రకృతి. ప్రకృతి నుండి బ్రహ్మ భావన. ఇతి ప్రజ్ఞాన ప్రస్థానం.

'మనం మృత్యువును, కర్మను జయించినప్పుడే ఆనందం, అప్పుడే సచ్చిదానందం, అమరత్వం ఓజస్సు లభిస్తాయి. ఈ 'కోశాల' వెనుక బ్రహ్మ పదార్థ దాగి ఉంది. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ

ఆనంద కోశాల కావల బ్రహ్మ ఉంది. ధ్యాని, కోశాల్ని దాటినప్పుడే బ్రహ్మానందస్థితి. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాల ప్రతిపత్తి కలుగుతుంది. మాయావరణ విచ్ఛిత్తి జరిగినప్పుడే ఆత్మదర్శనం.

'సూక్ష్మ శరీర హృదయమధ్యంలో ఒక పద్మం మొగ్గవలె
నిగూఢంగా, గుప్తంగానున్న ఆత్మదర్శనమైంది.'

'తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం, పరమాత్మా వ్యవస్థితః'

అగ్ని నీవారశూకవత్తన్వీ, పీతాభాస్ స్వత్యణూపమా, విద్యుల్లేఖేవభాస్వరా.'

ఆజ్ఞా చక్రం వరకే సంభూతి తారకం. ఆపైన చిదాకాశంలో ప్రస్థానం. అది అసంభూతి తారకం. అదే అమనస్కయోగం. ధ్యానంలో కాలం. మనస్సు అనే భ్రమలు తొలగాలి. అవిలేవు అఖండానంద చిన్మయ బ్రహ్మానుభూతిలో.

ధ్యానంలో స్వేదము, ప్రకంపన, అవరోహణ, ఆరోహణలు అనే స్థితులు కలుగుతాయి. స్వేదం, ప్రకంపన తర్వాత ఎక్కడో అథోలోకాల్లోకి విసిరివేయబడుతున్న భావన. ఆ తర్వాత మరల పైకి ఎగిరిపోతూ ప్రయాణం.

'శూన్యంలో కరిగిపోయే శిఖరాలపైకి ఆరోహణ
అసంభవమైన మహత్తుకోసం చిరాన్వేషణ'.

తారకయోగమే రాజయోగం.

'ఉన్నత శిఖరాల నుండి మానసిక ఆలోచనలు వెలువడి
కనుపాపలలో అద్భుతమైన తేజస్సును ప్రసరించి
అది పవిత్రమైన జ్ఞానజ్యోతిగా భాసిస్తుంది.'

కంటిపాపలో తారక ఉంది. అందులోని వెలుగు రహస్యమే బ్రహ్మవేది లక్షణం. ఆ వెలుగు కారణం బ్రహ్మ.

'యచ్చక్షుషా నపశ్యతి యేన చక్షూంసి పశ్యంతి
తదేవ బ్రహ్మత్వం విద్ధి'

కుండలిని కులయోషిత. రశ్మినాడి (సుషుమ్నా)

సుషుమ్నా - నాడి ఆ కులయోషిత యొక్క సంచార పథం. సుషుమ్నకు మేలిముసుగులు మూడున్నాయి. 1. సుషుమ్నా 2. చిత్రిణీ 3. బ్రహ్మణీ.

'కులీనవంశంలో జన్మించిన నయన తారవలె
రాచవీధులలో మేలిముసుగులేకుండా సంచరించవు.
ఆమె కేవలం అంతఃపురాలలోనే నడయాడుతుంది.'

ఇడా, పింగళా, సుషుమ్నా మూడునాడులూ కులకుండలిని యొక్క అంతఃపురాలు. అందుకే ఆ జగన్మాత త్రిపురసుందరీ ప్రఖ్య అయింది. ఆ మూడూ మేలిముసుగులు కూడా.

సంభూతి లేక మూర్తమైన తారకం దాటిన తర్వాత అమూర్తమూ, అసంభూతి తారకానుభూతి కలుగుతుంది. అప్పుడు విశ్వ విరాట్ తేజస్సు ద్యోతమానం అవుతుంది.

'అది సూర్యకాంతిని కన్పించకుండా చేసే వెలుగు
అటువంటి సుస్థిర, అచల స్థితికి ఆమె చేరుకున్నది.'

దీన్నే అచలయోగం, అమనస్కయోగం, అమూర్తతారకం అని పిలుస్తారు. అది నిలిస్తే భావసమాధి వస్తుంది.

'మహోన్నత భావనాబలంతో పునీతమై
దివ్యవర్చస్సులను వెలార్చే అంతర్లోకాలను
చేరుకోగలిగిన బాటసారీ! నీవు ధన్యవు.
ఓ సముజ్జ్వల జీవన పథగామీ! అన్వేషీ!
ఇదే నీ గమ్యం!'

దాంతో అన్వేషణా పరిసమాప్తి.

సావిత్రి యొక్క అన్వేషణని అరవిందులిలా చెబుతారు:
"ఆమె దృష్టి శాశ్వతమైన 'ఆది'ని అన్వేషిస్తున్నది."

శ్రీచక్రంలో దీన్నే బిందుస్థానమనీ, నాధస్థానమనీ అంటారు. జగన్మాత 'బిందుమండలవాసిని.'

ఆ బిందువు వెనుక ఆది బిందు స్థానము, ఆదినాధ స్థానము, సదా శివ స్థానము. కులకుండలిని ఆ స్థానాన్ని చేరి సాదాఖ్యకళయై 'సదాశివ పతివ్రతా

యైనమః' అవుతుంది. అదే చిరంతన చిద్ఘనానందరసానుభూతి. అండాండ, పిండాండ, బ్రహ్మాండములకు కారణాఖ్యయైన 'అసత్' 'సత్'గా ఉన్నప్పుడే భావన. 'అసత్' 'సర్వాతీత కళాత్మికా'.

ఇక్కడ సావిత్రి యొక్క అన్వేషణ సాదాఖ్య కళాన్విత పరంజ్యోతిని చేరటం. అదే 'ఆత్మవిద్యా'. 'అదే బ్రహ్మవిద్యా'. ఇది రహస్య ప్రస్థానం. ఇదే కామేశ్వరీ జగన్మాతృతత్త్వం.

'మూలత్రికోణ పీఠికపై రగిలే అగ్నిని చూడుతల్లీ
అదే గుహ్యంగా వున్న నీ ఆత్మకు ఆవాసమైన గహ్వరం'

మూలాధారం త్రికోణపీఠి. శ్రీ చక్రంలో లోలోపలి ఆది త్రికోణం. అందు అగ్ని దేహగతంగా కుండలిని, శ్రీచక్రగతంగా 'తేజో బిందు'.

బీజము, బిందువు, నాదము, కళ- ఇది బాహిర, అంతర, రహో యాగముల ప్రస్థాన చతుష్కము. బాహిరపూజలో మూర్తమైన దైవీ మానవ భావన. అంతర్యాగంలో క్రియాశక్తి స్వరూపిణీ భావన. రహోయాగంలో తేజోమూర్తి పరంజ్యోతి భావన.

రహోయాగంలో—

'నిరామయ, నిర్వికల్ప, నిశ్చేతన స్థితిలో
ఆరోహణ సంకల్పం తొలి మలుపు తిరిగింది.''

అక్కడ

'సుదీర్ఘ యామినీ కుంతలాలు, చంద్రదీప్తి వదనంతో
దుకూలధారిణియైన ఒక దేవత ఆసీనురాలై వుంది.'

దీన్నే 'చంద్రకళా విద్య' అని ఉపనిషత్తులంటాయి. మూలాధారం నించీ — సహస్రారం వరకు జ్యోతిష్మతీ ప్రస్థానం ఆరోహణ. మరల మూల త్రికోణ పీఠంపై చేరుట అవరోహణ.

ఆమె 'అందరూ వాంఛించే సుందరిని' అంటుంది.
'నా అనురాగమే జగన్నాటకానికి కథావస్తువు' అంటుంది.
'రాగ స్వరూపాశాఢ్యాయైనమః' ఇచట లోహితమూర్తి.

రాగం అంటే అరుణం. ఎరుపు. లోహితం.

'అజాం ఏకాం లోహిత కృష్ణ శుక్లాం'

ఇది త్రిదేవీ సమాహార స్వరూపం. శ్రీమాత ఆమె.

'అరుణాం కరుణా తరంగితాక్షీం.'

ఆమె అరుణారూపయై సృష్టికి ఇతివృత్తమైంది.

సావిత్రి — దేవీ విశ్వ విరాట్ రూపాన్ని దర్శించే ముందు ఆమె అవతార అంశమూర్తుల్ని దర్శిస్తుంది.

'దుర్గా దుర్గతినాశినీ' అని దుర్గా దర్శనం చేసింది సావిత్రి.

'సావిత్రీ : గుప్తమైన నీ ఆత్మను నేను

నా వర్తనం అనుక్షణం పరమాత్మ గమనిస్తూ ఉంటాడు '

అరుణమైన శ్రీమాత మందస్మితం లేనిదే సదాశివమూర్తికి తాండవ ప్రేరణలేదు. ఆమె లాస్య విలాసాలే సృష్టి చరితవ్య స్థితికి మూలకందాలు. ఇది తేజో రహస్యం,

'గుప్తమైన మహాతేజస్సుకు మూలం ఏదో చెప్పండి.

గుహ్యమైన నా ఆత్మకు ఆవాసం ఏదో చెప్పండి'

గుప్తమైన మహా తేజస్సు Source-Light. అది కాంతికి కాంతి. కంటికి కన్ను. మనస్సుకు మనస్సు. అది తెలివి అనే అనుభూతిగా మారే ముందు — జ్ఞాన స్పృహ పోవాలి. పోతే మిగిలేది శూన్యం. ఆ శూన్యం మహా తేజస్సుతో అనుభూతం అయితే అదే పూర్ణంగా భాసిస్తుంది.

శూన్యభావన విజ్ఞానమయకోశానికి సంబంధించినది. పూర్ణభావన ఆనందమయ కోశ సంబంధి.

సావిత్రిలోని కవితకు మార్మికత అన్న నిర్వచనం కుదరదు. అది అధిమానస కవిత, (over-mind-Poetry). సావిత్రి అసలు తత్త్వం పరాదేవి— త్రిశక్తి స్వరూపిణి అని అవగతం అవుతుంది. అప్పుడా అఖండ సాదాఖ్య చిత్కళ 'మార్గతార', మూర్తామూర్తాతీత.

'ఆమె ఆత్మ ఊర్ధ్వగమనంలో మరింత ఎత్తుకు వెళ్ళి

ఒక సముజ్జ్వల ఆనందమయ శూన్యాన్ని చేరుకుంది.'

అంటే విజ్ఞానమయ కోశం నించీ ఆనందమయ కోశాన్ని చేరింది. అదే సాక్షి చైతన్య స్థితి. ఇక్కడ కూడ మనస్సు - సూక్ష్మకారణంగా అవభాసిస్తుంది. మనస్సు ఉన్నంతవరకు జ్ఞానమూ, స్మృతీ తప్పవు.

అదే తురీయం. తర్వాత కేవలస్థితి. దాన్నే తురీయాతీతం అంటారు.

'యోగి నిర్మల హృదయంలోని నిశ్చలత అది.
అతనే సమున్నత ఏకాంత దివ్య భావన.
అనేకానేక ప్రజ్ఞానాల కంటే అది భిన్నం.'

సమాధిలో త్రిపుటి రాహిత్యం, జ్ఞానాజ్ఞానాల ప్రసక్తి లేదు. భావాభావ వివర్జితత్వం ఉంటుంది.

'జీవాత్మ పరమాత్మైక్యావస్థా త్రిపుటి రహితా
పరమానందస్వరూపా శుద్ధచైతన్యాత్మికా సమాధిః'

(అధర్వ-శాండిల్య)

ఆది దివ్య ఏకాంత భావన (Divine-aloneness). శుద్ధ చైతన్య అద్వైతానుభూతి. అప్పుడు ఆత్మదర్శనం. అపై బ్రాహ్మీస్థితి.

'సర్వజ్ఞానం విఫలమై భావరూపాలన్నీ నశించి
వివేకం కనుమరగై తలవంచుకున్నప.
భాషకు భావానికి అందని ఒక మహోన్నత సత్యం
రూపరహితంగా, అనశ్వరంగా అనుభూతికి అందింది'

'భావాభావ విహీనోస్మి భాషాహీనోస్మి భాస్మ్యహం
శూన్యాశూన్య విహీనోస్మి శోభనాశోభనోస్మ్యహం'(సామ-మైత్రేయ)

భావాభావ వివర్జితత్వంతో శూన్య, అశూన్య విచికిత్స పోతుంది. అప్పుడంతా పూర్ణమే. అపుడు—

'మనః ప్రచారశూన్యం పరమాత్మ నిలీనం భవతి'

(శుక్ల.యజు - మండల బ్రాహ్మణ).

మనస్సు ప్రచారశూన్యమై పరమాత్మలో లీనమవుతుంది. ఆ మహా స్థితిలో —

'తన ఆత్మ అన్నది లేదు. ఉన్నదొకటే పరమాత్మ.
ఆ పరమాత్మ తనకు తెలియదు. ఉన్నదని మాత్రం తెలుసు.

'తనలో నిండుగా చీకటి అలముకొంది'

పవిత్రమైన చీకటి - గుణాకాశ, సూర్యాకాశములపైన గల మహదాకాశము. దాన్నే ధ్యానంలో Black - Light అంటారు. అది చిన్మాత్ర స్థితి.

'ఆమె తొలి ద్వారంలో కాపున్న 'నిద్ర'ను దాటిపోయింది.'

అంటే తురీయంలోకి వెళ్ళింది.

'అనేకానేక దేవతామూర్తులను దర్శించగలిగింది'

ఇది గుణాకాశలక్షణం.

'అక్కడ ఉచ్ఛ్వాస నిశ్వాసలు వినిపించవు.'

ఆ తర్వాత సూర్యాకాశం.

'ఆసూర్యతేజంముందు సర్వవిజ్ఞానం ఒకకిరణమే'

ఆపైన మహదాకాశం,

'ఆపైన సర్వము నిశ్శబ్ద ఆత్మలో లీనమైంది,

సర్వం రూపరహితం, నిర్గుణం, నిర్మలం అయింది.

"గండశిలను తొలగించి మార్గం ఏర్పరచుకొన్నట్లు

అహీనకాంతి ప్రకాశించే తావుకు ఆమె చేరుకొన్నది."

అంటే తత్త్వాకాశ, పరాకాశ పరిధుల్ని దాటింది.

ఇలా తురీయాతీత పంచకళాత్మిక శుద్ధసత్వ యోగమాయా పరంజ్యోతి అవుతుంది సావిత్రి చివరకు.

"అప్పుడంతా జ్ఞానమయమే. బ్రహ్మానందమయమే."

మిత్రులు శ్రీ శార్వరి - శ్రీ అరవింద మహాయోగి విరచిత సావిత్రికి చేస్తున్న తెలుగుసేత విషయం తెలిసి చేస్తున్న ఆరాధనావిశేషం. తెలుగు సాహిత్యాన్ని, విశ్వవీధుల్లో విహరించే రీతిగా తీర్చిదిద్దాలన్న అవగాహన యీ ప్రయత్నం. ఇదొక తాత్త్విక దర్శనం.

వినాయక చతుర్థి — అరిపిరాల విశ్వం

10.9.83. హైదరాబాద్,

❊

# ప్రణయం

విధి నిర్నిరోధమైనప్పుడు మన ఇచ్ఛాసంకల్పాలు నిరర్థకం అవుతాయి. అసలు వైరుధ్యం సృష్టిలోనేవుంది. మనిషికి తనను తాను చక్కదిద్దుకునే స్వేచ్ఛవుంది — సంకల్పం తాను చేయగలడు. తన సంకల్పాన్ని మార్చుకునే శక్తి మనిషికిలేదు. ఫలితం అనుభవించవలసిందే. మనం నాటే విత్తనాలు పంటలు పండిస్తాయి. మన సంకల్పాలు, భవిష్యత్తును నిర్ణయిస్తాయి. అవి, ఇవీ దైవనిర్దేశాలే.

చేసిన పాపాలకు ఫలితం మృత్యువు — అయితే పుణ్యం చేసినవాడూ మరణించవలసిందే — భగవంతునికి అసాధ్యం ఏదీలేదు—మనిషికి అసాధ్యం అయింది దైవానికి సాధ్యం. అయితే మానవత్వానికి, దివ్యత్వానికి సరిహద్దు ఏది ? మనిషి పరిస్థితులకు బానిస, కర్మకు బద్ధుడు — మృత్యువు, కామం, అసహాయత మనిషిని లోబరచుకుంటాయి - అజ్ఞానస్థితి నుండి జ్ఞానస్థితి వరకు ఉన్నది మానవతే. పశుస్థితికి, దైవస్థితికి మధ్యనున్నది మానవత. కనుక ప్రయత్నంవల్ల మనిషి కర్మబంధంనుండి తప్పించుకొనే వీలున్నది.

నారదమహర్షి భవిష్యత్తు గురించి వివరించినా, సావిత్రి సత్యవంతునే వివాహ మాడదలచిందంటే, విధి బలీయమనికాదు. విధిని తప్పించుకొనే వీలున్నదనే. సావిత్రి హృదయానికి తెలుసు. కానీ ఆమె మానవిగా, ప్రపంచ విధానాన్ని దాటి పోదలచలేదు — సత్యవంతునికే తన సర్వస్వం అర్పించింది. తల్లిదండ్రుల్ని వదలి, ప్రియుని చేరింది — కోరి అరణ్యవాసాన్ని, ఆశ్రమ జీవితాన్ని వరించింది.

దివ్యమైన ప్రేమ, మానవసహజమైన కామం వివాహంతో పవిత్రంగా 'సంయోగం' అవుతాయా ? సావిత్రి తనలోని దివ్యాంశను మరచి, మానవ యువతిగా ప్రవర్తించింది కానీ మహర్షిమాటలు మరచిపోలేదు. అవి ప్రతి క్షణం జ్ఞాపకం వస్తూనేవున్నాయి - ఆ రహస్యమేదో తనకే తెలుసు. అత్త మామలకు తెలియదు, భర్తకుతెలియదు - సూచనగానైనా ఎవరికీ చెప్పలేదు. ప్రేమమైకంలో ఆబాధను మరచిపోవాలని యత్నించింది. విఫలమైంది. సత్యవంతునితో ఎంత సుఖించినా తృప్తిలేదు— ఆలింగనాలు, ప్రేమబాసలు లోపలి గాయాన్ని మాన్పలేకపోయాయి.

తన ఆనందాన్ని సుఖాన్ని ఇతరులకు పంచియిస్తూ, వారి బాధల్ని తను పంచుకుంది - రోజులు గడుస్తున్నకొద్దీ, క్షణకాలవియోగం కూడా బాధగానే పరిణమిస్తున్నది - ఆమె హృదయక్షోభ సత్యవంతుడు గ్రహించలేదా? ఆమె చెప్పలేదు సరే : లీలామాత్రంగానైనా అనుమానించలేదా !

తాను సంపూర్ణంగా ప్రేమించాడు. ఆమె తృప్తికోసం చేయగలిగినంత చేశాడు. నిత్యకృత్యాలకుపోను, మిగిలిన కాలాన్ని ఆమె సన్నిధిలో, కౌగిలిలో గడిపాడు — ఆమె ఆలోచనలువేరు ! తాను సత్యవంతుడు మరణించగానే, అతనితో పరలోకాలకు వెళ్లడమా ! మానడమా ! వెళ్లగలదు. అక్కడ నిత్య యవ్వనంతో, అమరులై సుఖభోగాలు అనుభవించవచ్చు. కానీ సత్యవంతుని తల్లిదండ్రులు ముసలివారు ! వారిసేవ చేయడానికి తాను తప్ప ఎవరులేరే ! వారికోసం తను బ్రతికితీరాలి లోకం బాధ అంతా సావిత్రి గుండెలో గూడు కట్టుకున్నది తన బాధనే ప్రపంచం బాధగా స్వీకరించింది.

సుఖసంతోషాలతో గడపవలసిన ఒక్క సంవత్సరకాలం ఆలోచనా భారంతో గడిచిపోయింది — ఆమె ఉన్నది అరణ్యంలో, ఆమెలో ఉన్నది అరణ్య ప్రశాంతి.

ముందుగా చూడగలిగిన మార్గంలో విధి ఆమెను వెన్నాడింది.

మనిషి ఆశలు, ఆశయాలు, అతని లక్ష్యానికి
అనుకూలంగా, అగోచర గమ్యానికి చేర్చేవిధంగా,
అతని సంకల్పం గుడ్డిగా, జీవితరథాన్ని నడిపిస్తాయి.
అంతర్దృష్టి అతని చర్యలను, కర్మలను రూపుదిద్దుతుంది.

అందుకు అనుగుణంగానే పాపం, బుద్ధి ఏర్పడి ఉంటాయి.
వానిమాతృకలు అతని ఆత్మలో గుప్తంగా ఉంటాయి.
భౌతికజీవితాన్ని పదార్థం రూపుదిద్దుతుంది
దాని స్వభావానికి అనుగుణంగా ఆత్మ మసులుతుంది
ప్రకృతి, కర్మ స్వసంకల్పాన్ని నిర్దేశిస్తుంటాయి.

మహాత్ములు ఈ క్రమాన్ని మార్చుకోగలవు
వారివారి ఆత్మలే వారి విధిని తీర్చిదిద్దుతాయి.
ఆ మార్మిక సత్యాన్ని మన అజ్ఞానం దాచివేస్తుంది.
పుట్టకతో ఏర్పడిన వికారం పుడకలతోగాని పోదు
మన కష్టాలు, బాధలు జీవుడు గుప్తంగా కల్పించేవే
ప్రతీదానికి కార్యకారణసంబంధం కనిపిస్తుంది.

సావిత్రి హృదయం వీటన్నింటిని నింపుకుంది
ఆమె కుసుమ కోమలం, కఠినం, ప్రశాంత ప్రేమమయి.
కృత నిశ్చయంతో, తన స్వశక్తితో, సృష్టిని
మలుపు త్రిప్పాలని పూనిక వహించింది.
అందుకై . తిరిగి రథాన్ని ఆరోహించి బయలుదేరింది
సైనికుల కోలాహలం, రథాల చప్పుళ్లు,
క్రమంగా దూరమై, దూరంలో కలిసిపోయాయి.
మగతగా నిద్రిస్తున్న వసుంధర మేల్కొనసాగింది.
తన మగత వదలి, ఆమె ఆవేగాన్ని గమనించింది.
వేసవి ఆకాశం క్రింద విస్తరించిన భూములుదాటి,
మండు టెండల మెరసిపోయే పర్వతాలు దాటి,
విశాల మైదానాలు, సువిశాల క్షేత్రాలు అధిగమించి
చంద్రకాంత మణులవలె మెరిసే నగరాలు దాటింది.
పచ్చ పచ్చని నదుల్ని, సింహాలు సంచరించే అరణ్యాన్ని దాటి
చివరకు సాల్వదేశ సరిహద్దుల అడవులు చేరింది.
అవి అన్నీ ఘనీభవించిన ఆనందమయభూములు
అవి పవిత్రతకు శిఖరాలు, ప్రశాంతికి నెలవులు.

విధి తనకు నిర్దేశించిన సుందరప్రదేశం చేరువైంది.
తపోవన తీరాలు – ఆనందంతో పులకిస్తున్నాయి.
అక్కడనే తాను సత్యవంతుని మొదట చూసింది.
అతను స్వప్నచంద్రికా మాధుర్యంతో, దివ్యాంశతో
భూమిపైన అవతరించినట్లు కాలాతీత సౌందర్యం,
వాస్తవికత, కలలో మేల్కాంచినట్లు అగుపించాడు.
గతం నిష్క్రమించగా, భవిష్యత్తు సమీపించింది.

మద్రలోని విశాల భవనాలన్నీ కనుమరుగైనాయి.
పాటి పాలరాతి స్తంభాలు, శీతల తరుచ్ఛాయలు
నవరత్న ఖచితమైన మండపాలు, మందిరాలు,
జలాశయాలు, మధువనాలు. మధుకరాలాపాలు
క్రమంగా మధుర స్మృతులై, కరిగిపోయాయి.

రాతిజలాశయంలోకి ప్రవహించే జలపాతం,
మిట్టమధ్యాహ్నం భావసమాధిలో వున్నవేడి
సాయంత్రపు ప్రశాంతినుండి స్వప్నంలోకి జారే సంధ్య
రాత్రి తొలిజాములో నెమ్మదిగా సాగే చంద్రకాంతి.
ఆమెకు తెలిసిన సుఖాలన్నీ దూరమైనాయి
ఆనందంతో నర్తించే అధర దరహాసాలు,
చేయిచేయి కలిపి ఆడుకునే నెచ్చెలులు,
కన్నులలో జ్యోతుల్ని వెలిగించే ఆరాధకులు.
అందరు ఆమెకు దూరమై, ఒంటరిని చేశారు,
అక్కడ ప్రకృతిలో ప్రాయిక ప్రశాంతి నెలకొన్నది
ఇక్కడ వినిపించేవి పశుపక్ష్యాదుల స్వరాలు
చీకటి ఆత్మగుహలో ఆశ్రయం పొందిన తాపసికి
నిర్జనారణ్యంలో మానవ స్వరాలు వినిపించవు
మనుషుల పలుకులు, అడుగుల నడకలు వినిపించవు.

అరుణ రవిని మేఘంక్రమ్మిన సాయంసమయాన
పూలతోటలమధ్య, సన్నని కాలిబాటవెంట

నింగీ, నేలా కళ్లువిప్పి గమనిస్తున్న వేళ,
పచ్చని బయళ్లుదాటి తమ ఆశ్రమాన్ని చేరుకున్నారు.
ఆ తర్వాత మార్గం అగమ్యం, అస్పష్టం అనిపించింది.
పెద్ద పెద్ద మానుల నీడలలో కలిసిపోయిన బాటలు
ఎండవేడికి ముకుళించుకుపోయిన లతామండపాలు
ఆపైన చిన్నచిన్న పర్ణశాలలశిఖలు కనిపించాయి.
అవి అన్నీ నీలాకాశపు పందిరిక్రింద చేరినట్లు
భయంకరారణ్య మధ్యంలో విశ్రమకేంద్రంగా,
సూర్యకాంతిలో ఆశ్రమ ఆవాసం కనిపించింది.
మానవసంకల్పం, ఆలోచన అక్కడ ఆశ్రయించడం
ఆ మహారణ్య వృక్షాలన్నీ గమనిస్తూనే ఉన్నాయి.

ఆశ్రమజీవనం అనాగరక, ఆటవిక జీవనం అయినా,
ఆమె విధి ననుసరించి, అది అననుకూలంగా భావించలేదు
అంధమహారాజ సేవలోనే వారు తృప్తిచెందసాగారు
పతనమైన మహాశక్తికి, ఆయన రాచరిక స్తంభం
ముసలి వగ్గయిన ఆమె ఒకప్పుడు మహారాణి
ఇప్పుడామె తనకుగా కోరగలిగిందేమీ లేదు
ఆమె ఆశలన్నీ ఏకైక కుమారునిపై కేంద్రీకరించి
ప్రపంచంలోని సుఖాలు, స్వర్గసంపదలు
తన బిడ్డకు దక్కాలని విధిని ప్రార్థిస్తున్నది.
అతనిలో దేవతల అందాన్ని, వివేకాన్ని ఆరాధిస్తూ
తనవలె దేవతలు అతనిని ప్రేమిస్తున్నారనుకుంది
అతని అదృష్టం, ఆనందం చూచి మురిసిపోయింది,
కానీ చేరువవుతున్న ప్రమాదం ఆమెకు తెలియదు.

ఆమె వెంటవచ్చినవారు, కొన్నాళ్లు అరణ్యంలో తిరుగుతూ
ఆత్మీయుల వియోగాన్ని భరించలేని వారివలె
స్నేహబంధాలను త్రెంచుకొన మనసురాక భారంగా
కడసారి ఆమె దర్శనంతో తృప్తి చెందలేక

రానున్న రోజుల వివిషాన్ని భరించే శక్తిలేక
విధి నిర్దాక్షిణ్యంగా తమని విడదీస్తున్నదని
భగవంతుని నిర్ణయాన్ని విధి విచ్ఛిన్నం చేస్తున్న దని
భావించి, బాధతో ఆమెను వదలి పోసాగారు.
ఆమె కర్మ ఒక్కటే ఆమెను నడుపుతుందని,
సావిత్రి నిర్ణయాన్ని తాము మార్చలేమని తెలిసి,
ఆమె ఆనందానికి, విషాదానికి ఆమెను వదిలారు
అరణ్య మధ్యలోనే ఆమెను వదలి వెళ్ళిపోయారు.

ఒకప్పటి సుఖజీవనం మరుగున పడిపోయింది.
ఇప్పుడు వారిరువురిదీ కొత్త జీవితం—
సత్యవంతునితో కలిసి మహారణ్యంలో నివాసం
ఆమె పొందే అమూల్యానందాలు, మృత్యువుకు సన్నిహితం
ఆమె 'ప్రేమ' కోసమై ప్రేమకు ఎదంగా బ్రతుకుతోంది.
రోజులు గడుస్తున్న కొలదీ ఆత్మసంయమనం ఎక్కువైంది
ఆమె ఆత్మ నిశ్చలంగా కాలాన్ని గమనించసాగింది.
ఆమె అనురాగానికి, నిగ్రహశక్తికి ఆలంబనం
అచంచల సంకల్పమాధుర్యానికి ఆమె ప్రతీక
అజేయము, సుస్థిరము అయిన దేవతల
ప్రశాంతికి, అశాంతికి ఆమె ఆలవాలం.
మొదట, వినీల గగనం క్రింద ఆశ్రమ జీవనం,
ప్రశాంతత అద్భుతస్వప్న అనిపించింది.
వేసవి ఎండలు, ప్రచండాగ్నులు, తీవ్రమై
అంబర చుంబితాలైన తరువులు దివ్యమందిరాలై,
వనశోభలన్నీ ఆనంద హేతువులైనాయి
వినిపించే స్వరాలన్నీ ఆనంద గీతాలైనాయి.

అక్కడ వీచే గాలులలో సంగీతం వినిపించింది
అక్కడ ప్రసరించే ప్రతి రవికిరణం ఉజ్వలమే
ప్రతిరేయి దుకూలాలు పరచుకున్న చంద్రకాంతులే

అణగి మణగిన చీకట్లు, లేదా పండు వెన్నెలలు
ప్రతి పగలు ఒక రమణీయదృశ్యం, ఒక గీతం
ఉదయంనుండి అస్తమయం వరకు కాంతితరంగాలే.

ప్రియుడు దరిలేని సమయాల మధురస్మృతులు
అతని సాన్నిధ్యం ఒక దేవుని కొలువు.
భూలోకసుఖాలు, స్వర్గసుఖాలు కలపోత
సుఖపారవశ్యంలో అంతులేని ఆనందం
రెండు జీవులు ఒకటి కావాలన్న తహ తహ
ఒకే జ్వాలలో రెండు శరీరాలు దగ్ధం అవుతున్న తపన.
మరువలేని మహానంద ద్వారాలు తెరుచుకున్నాయి
భూతల స్వర్గంలో రెండు జీవితాలు ఏకమైనాయి
ప్రేమ తీవ్రతకు, విధి, విషాదం పారిపోయాయి.

అంతలోనే వేసవి గాడ్పుల ఉధృతం తగ్గింది
నీలి నీల మేఘాలు ఆకసంలో ముసురుకోసాగాయి
ఎండకు వాడిన ఆకులపై వర్షపు చినుకులు రాలాయి
అరణ్యం అంతా తుఫానుకు గురైంది.
ఆ భయంకరమైన ఉరుములు, మెరుపులు
ఆపైన కుండపోతగా కురిసిన జలధారలు
హోరుమని రొదచేస్తూ వీచే ప్రచండ మారుతాలు,
విహారంతో, భయంకర శబ్దాలతో, నిశి నిండిపోయింది
ప్రపంచంలోని విషాదం అంతా ఆమెను చేరుకుంది.
నిశి అంధకారం ఆమె భవిష్యత్తుకు సూచకమైంది.

తన ప్రియునికి రానున్న ఆపద నీడలా తలఎత్తింది
ఆమె భౌతిక హృదయంపై భయం ముద్రవేసింది
రోజులు వేగంగా, నిర్దాక్షిణ్యంగా సాగిన కొలదీ
నారదుడు పెట్టినగడువు ఆలోచనల్ని కలచివేస్తున్నది
తనకున్న సంపదలేవీ తృప్తి నివ్వడం లేదు
ఆ గడువుకు మధ్య ఎన్నిరోజులన్నదే ధ్యాస.

ఆ నిరీక్షణ అనుక్షణం గుండెను కలచివేస్తున్నది
కాలం వేసే అడుగులు భయంకరంగా వినిపిస్తున్నాయి
అత్యంత ప్రేమగా, విషాదంవచ్చి ముంగిట నిలిచింది
అతని కౌగిలిలో ఉన్నంతసేపు అది దూరమైనా,
ఉదయం నిద్రలేచేసరికి ఆమెను పలకరిస్తున్నది.

ముంచుకువస్తున్న విషాదాంతాన్ని తప్పించుకుని
ఆనంద పారవశ్యానికై వ్యర్థప్రయత్నం చేసేది.
ఎంతగా ప్రేమలో లీనమైతే, బాధ అంత ఎక్కువయ్యేది.
మాధుర్యపు లోతులనుండి, అంత విషాదం తలయెత్తేది.
జ్ఞాపకాలు అనవరతం బాధించగా, ఆమె ప్రేమ
కావ్యంనుండి ప్రతిరోజు ఒక్కొక్క పుటను
నిర్దాక్షిణ్యంగా చించివేయసాగింది.

అలా అలా ఆనంద ప్రభంజనాలలో ఊగిపోయి,
విరిగిపడుతున్న విషాద తరంగాలకు ఎదురునిలిచి
గుండెను విచారాలతో, ఉపద్రవంతో నింపింది
అవి అన్నీ ఆమె హృదయంలో తిష్టవేసినవే,
ఆమె అంతరంగంలో వేటికవిగానే ఉన్నాయి—
ఆమెకళ్లు భవిష్యదంధకారనిశిలోకి చూడ సాగాయి.
తాను ప్రేమించే వారిమధ్య అప్రయత్నంగా తిరుగుతూ
తన ప్రత్యగాత్మతో వారిని అవలోకించ సాగింది.
వారికి హృదయపరంగా చేరువైనా, మానసికంగా దూరమే
అజ్ఞానం వల్ల ఆనందంగా కనిపిస్తున్న ప్రపంచం
మనుష్యులు ఎంత నిశ్చింతగా జీవిస్తున్నారో గమనిస్తూ,
కనిపించని మృతువువైపుగా సాగిపోతున్నది.

వారు దగ్గరగా వున్నా, వేర్వేరు లోకాలు వారివి.
రేపొకటున్నదన్న విశ్వాసం వారికున్నది
నేటి భయాలను, బాధలను విస్మరిస్తారు
కానీ, ఆమె భయంకర జ్ఞానంతో ఏకాకి అయింది.

వంటపనులు, పూజామందిర కార్యక్రమాలు.
స్త్రీగా, తాను చేయవలసిన పనులన్నీ చేసింది.
ఆమె చేసే పనులన్నింటిలో దివ్యత్వం కనిపిస్తుంది.
ప్రతి కదలికలోనూ, భూప్రపంచానికి వెలుగు
ప్రసాదించగల ఏకత్వాన్ని స్పందించింది.
సామాన్యకార్యాలను ప్రేమతో ఉదాత్తంగా మార్చింది.

ఆమె ప్రేమైకమూర్తిగా, దివ్యబంధంతో అందరినీ
అందరితో చేర్చి, అందరినీ తనతో ముడివేసుకుంది.
కాని తనలోని విషాదం పొంగి పైకి పొరలినప్పుడు
ఆమె ఆనందానికి ప్రతిరూపాలైన విషయలాలసలన్నీ
అర్థరహితంగా, పై మెరుగులుగా అగుపించాయి.
కేవలం యాంత్రికంగా, శూన్యంగా తోచాయి.
ఆమె సంకల్పానికి, శారీరకక్రియలకు సంబంధం లేదు.

ఈ విచిత్రమైన ద్వంద్వ ప్రవృత్తి మాటున
ఆమె ఆత్మ ఒక జ్వలితాగ్ని సాగరం వలె
ప్రియుని తనలో చేర్చుకోవాలని తపన చెందింది.
ఒక్క ఆలింగనంతో పతిని రక్షించుకోవాలన్న ఆశ.
రాత్రిఅంతా క్షణాలు లెక్కిస్తూ జాగరణం చేసింది.
అతని శరీరాన్ని వదనాన్ని తనివి తీరా ముద్దాడింది
నిద్రిస్తున్న సత్యవంతుని అల్లుకుపోయింది
తన చెక్కిలిని అతని పాదాలకు చేర్చింది.

ఉదయం మేల్కొనగానే అతని పెదవులకు తన
పెదవులు చేర్చి, విడిపోవడాన్ని ఇష్టపడేది కాదు.
ఆనందపారవశ్యంలో మధువుల్ని వదులుకోలేక
అతని శరీరం తననుండి దూరంకారాదన్న ఆరాటం.
మమతాను రాగాలకు ప్రేమచిహ్నాలు అవే.
దుస్సహమైన కాల దారిద్ర్యం వల్ల
ఉన్నకాలంలోనే వలపును బంధించాలన్న తపన.

ప్రణయమధురిమను, అపార పారవశ్యాన్ని
శతాబ్దాల అనుభవాన్ని ఒక్కరోజులో అనుభవించాలని,
కాదా, కాలాన్ని బంధించి స్తంభింపచేయాలని
రెండు మానవజీవితాల ప్రగాఢ సంయోగంలో
ఆమె ఆత్మ అతని ఆత్మలో నిమంత్రణమైంది.

ఎంత అనుభవించినా ఇంకా కావాలన్న ఆరాటం
ఎంత బిగికౌగిలి అయినా ఇంకా అసంతృప్తే.
"ప్రియతమా, నీ వలపు ఇంకాఇంకా నాకు పంచిఇవ్వవూ,
నిన్నే ప్రేమిస్తున్న నాకు నీ ప్రేమ ఇంకాఇంకా కావాలి.
నా అణువణువులో నీ ముద్రలు పడనివ్వు
నా హృదయం నీ సంగతులతో పులకరించనీ
మనం త్వరలోనే విడిపోయి, జన్మచక్రభ్రమణంలో
మళ్లీ ఎంతకాలానికి, ఎక్కడ కలుసుకుంటామో
ఈ ప్రేమను మళ్లీ మనం పొందగలిగేది ఎన్నటికో !"

అని సత్యవంతునితో చెప్పాలని అనుకునేది.
కాని ప్రేమాతిశయం వల్ల చెడ్డమాట చెప్పలేకపోయింది.
తన విచారభారాన్ని అతని తలపైకెత్తలేక పోయింది.
ఉబికివస్తున్న దుఃఖాన్ని తన గుండెలోనే అదిమిపెట్టి
నిస్పృహాయంగా, నిబ్బరంగా, నిర్మోహంగా ప్రవర్తించింది.

అప్పుడప్పుడు సత్యవంతునికి కొంత అర్థం అయ్యేది
ఆమె సమాధానం స్పష్టంగా లేనట్లు తోచేది
ఆలోచనలు లేని మనస్సులకు ఆ అవసరంలేదు
ఆమె ప్రేమలో ఉక్కిరిబిక్కిరై సర్వం మరచేవాడు.

అడవిలో కట్టెలు కొట్టుకురావడానికి వెళ్లినప్పుడు
అరణ్యాలలో ఆహారానికై వేటకు వెళ్లిన సమయం
అంధుడైన తండ్రికి సేవలుచేసే కాలం, మినహా
మిగత సమయాన్ని, సావిత్రి సాన్నిధ్యంలో. ఆమె
ఆనందంకోసం, తృప్తికోసం వెచ్చించేవాడు.

ఆమె కిష్టమైన సంగతులు ముచ్చటించేవాడు.
అనవరతం ఆమెను తన కౌగిలిలోనే బంధించేవాడు.
తను అనురాగం ఎంత అందించినా ఆమెకు తృప్తిలేదు.
ఆతని సమక్షంలో స్వీయబాధను కొంత మరచినా
అతను దూరమైనప్పుడు విచారం తీవ్రమయ్యేది.
ఒంటరిగా నున్న సమయంలో అనుక్షణం
రానున్న రోజుల ఎడారి జీవితం కళ్లకు కట్టేది.

మృత్యుద్వారం దాటివెళ్ళిన తర్వాత దివ్య
లోకాలలో పునస్సంధానం ఊహించుకున్నా
చితిమంటలలో శరీరం దగ్ధం కావడం కనిపించేది.
అతనితో సహగమనంచేసి, మరణించి, అతని
చేయిపట్టుకుని పరలోకాలకు పయనించి,
ఆ స్వర్గలోకాలలో, భయంకర లోకాలలో
పొందే సుఖదుఃఖాలు తనకు అవసరం లేదనుకుంది.
దైన్యస్థితిలోనున్న ఆతని వృద్ధ తలిదండ్రులకు,
శూన్యమైన వారి శేషజీవితానికి సాయంకావాలి.
ఒక్కొక్కసారి ఆమెకు అనిపించేది, యుగాలబాధ

తన ఒక్కదానిలో విషాదంగా గూడుకట్టుకున్నట్లు,
ఈ యాతనామయ ప్రపంచం తనలోనే కన్పిస్తున్నట్లు.
తన ఆత్మలోని రహస్య మందిరంలో,
విషాదంతో రహస్యంగా ప్రేమ జతపడినట్లు,
కనిపించని దేవతలను మూగగా ఆరాధించింది.
ఆమె నిశ్శబ్ద నివేదన వారికి తృప్తి కలిగించలేదు.
తన విషాదాన్నే పరిమళాలుగా సమర్పించింది.
తన జీవితాన్ని బలిపీఠంచేసి, తానే బలి అయింది.
అయినా వారు ఒకరిలో ఒకరు లీనమైపోయేవారు.
ఏ శక్తి తమని వేరుచేయలేదన్న విశ్వాసం,
చివరకు శరీరాలను సైతం వేరుచేయలేదన్న ఆశ.
అతను అరణ్యాలలో తిరుగుతున్నప్పుడు సైతం,

ఆమె ఆత్మ తనను వెన్నంటి, తనతోనే అతను
సంచరిస్తున్నట్లు, ప్రతిపనిని గమనిస్తుండేది.
అది తెలియని సత్యవంతుడు, ఆమెను ఊహిస్తూ
ఆమె రూపాన్ని మనసులోనే ఆరాధించేవాడు.
భయవిషాదాలు మహత్తర ప్రేమకు నీహారాలు.
ఆ వ్యథ పెరిగి పెరిగి విశ్వమంతగా వ్యాపించింది.
అదే ఆమె జీవిత సర్వస్వం, ఆమెకు భూమ్యాకాశాలు.
మనిషిగా జన్మించి, కాలంతో ముడివడిన కారణంగా,
దేవతలవలె ఆత్మకు చావు లేకపోయినా,
ఆమె దివ్యశక్తి అనంతంగా వ్యాపించింది.
కాలం, కర్మం కొట్టే దెబ్బలకు గురి అయింది!
విషాదం కలిగించే సరదాలకు విసిగిపోయి,
ఆత్మ అతిప్రశాంతంగా, గంభీరంగా మారింది.
ఆ భయంకర పోరాటంలో ఫలితానికి సిద్ధమైంది.
ఫలితంగా ఒక మహా సంఘటన జరగాలి.
మృత్యువును, కన్నీటిని జయించాలి.
పరిణామం అంచుపైన ఏడాదికాలం గడచింది.
భయంకర పక్షులువిప్పిన తుఫానులు లేవిప్పుడు,
ప్రపంచాన్ని కబళించే మేఘగర్జనలూ లేవు.
కానీ ఆకాశంలో ఒక ఉరుము వినిపించింది.
ఏడ్చి యేడ్చిన ఆకాశం బరువుగా కన్నీరు కార్చింది
నెమ్మది నెమ్మదిగా మేఘాలు భూమిని అలముకున్నాయి
అలాగే ఆమె గుండె విషాద ఆకాశమే అయింది.
ఆత్మ ఎక్కడో దాగివుంది, వెలుగు కనిపించడం లేదు
మరచిపోయిన ఔన్నత్యాల వాణి వినిపించడం లేదు
రహస్యంగా తనలో రగులుకుంటున్న వ్యథలో
దైహిక కర్మగురించి ఆమె హృదయం ఆలోచించింది.



# ఆత్మశోధన

సావిత్రికి నిద్రరాదు. నిద్రిస్తున్న సత్యవంతుని ప్రక్కనకూర్చుని జాగరణ చేసింది – రానున్న విపత్తును ఊహించింది – కలవరపడింది. అలాంటి స్థితిలో ఒక రోజు రాత్రి ఆమె మగతగా, సమాధిస్థితిలోకి వెళ్ళింది. అశరీర వాణి ఆమెను ఆక్రమించింది. అంతర్వాణి పలకరించింది ‘‘అలా మూగగా కూర్చున్నావు. నీవు వచ్చిన పని ఏమిటి ? చేస్తున్నదేమిటి ? కర్తవ్యం మరిచి పోతే ఎలా’’ అని కర్తవ్యాన్ని జ్ఞాపకం చేసింది.

‘‘చేయడానికి మనసు లేదు, చేయాలన్న ఆసక్తి లేదు, అందుకు తగిన శక్తిలేదు, ఏం చేయను ? ఎలా చేయను’’ అని విన్నవించుకుంది సావిత్రి – “తనకేం ! సత్యవంతునితో సహగమనం చేయవచ్చు – తన హృదయాన్ని అతని హృదయానికి చేర్చి, పరలోకంలో శాశ్వతంగా సుఖించవచ్చు. మధ్య భగవంతుడు, పరమాత్మ ఏమిటి ? ఎవరినీ లెక్కచేయవలసిన పనిలేదు– ఆత్మ శరీరంతో హాయిగా ఉండవచ్చు. భౌతికశరీరం లేకపోతేనేం’’ ఆ రహస్యం ఆమెకు తెలుసు.

కానీ ఆమె జన్మకారణం అదికాదు. ఆమె కారణజన్మురాలు గదా ! పరబ్రహ్మ ప్రతినిధిగా అవతరించింది. జగన్మాత అంశగా జన్మించింది – తాను చేయవలసిన పని వేరు – అందుకు భూమిక సిద్ధమైంది. కాని మార్గమే

రాత్రిళ్లు నిద్రలేకుండా జాగరణ చేస్తున్నది
ఘడియలు మందంగా, బరువుగా కదలసాగాయి.
విషాదభారాన్ని ఆమె తన ఎదలోపల అణచివేసి
క్షణాలు లెక్కిస్తూ, కాలం గడపసాగింది.
చేరువవుతున్న విధికోసం ఎదురు చూడ సాగింది.
అప్పుడు ఆమె హృదయంనుండి ఒక పిలుపు,
నిశీధిని చీల్చుకుని ఒక వాణి వినిపించింది.

ఇచ్ఛా జ్ఞానం ఏకమయే భృకుటికి పైగా
మహత్తర దివ్యవాణి ఆవిర్భవించింది.
అది మహోన్నత శిఖరాలనుండి దిగివచ్చినట్లు
అయినా ఈ విశాల విశ్వం తనకు తెలిసినట్లు
కాలగమనంలో జరిగేవన్నీ తనకు అర్థం అయినట్లు
అచంచలమైన అనంత కర్మ రంగాన్ని దర్శించింది.
దృష్టికి అందినంతవరకు సృష్టిని పరిశీలించింది.
దివ్యవాణి స్పర్శతో ఆమె శరీరం జడప్రాయమైంది
నిశ్చల సమాధి స్థితిలో స్వర్ణమూర్తిగా భాసించింది
ఆత్మజ్యోతిగా వెలుగుతున్న పరమాత్మ విగ్రహం ఆమె
నిశ్చలంగావున్న ఆమె చుట్టూ అంతా నిర్మలమైంది.
ఆమె హృదయం సునిశిత స్పందనల్ని వినసాగింది
మనస్సు అన్ని ఆలోచనల్ని వదలి, నిరామయమైంది.

"మృత్యువాతబడే ఈ మూగ ప్రపంచంలోకి ఎందుకు వచ్చావు?
ప్రతికూల వాతావరణంలో జీవితం అజ్ఞానంలో,
కాలం అనే బలిపీఠంపైన కట్టివేయబడిన బలి.
ఓ జీవా ! ఓ అనంత అమర తేజస్వినీ !
నిస్సహాయ హృదయంలో విషాదాన్ని భరించదలిస్తే
కన్నీరు కార్చకుండా, కర్మను అనుభవిస్తావా ?
ఓ ఆత్మా, మేల్కొని, కాలాన్ని, మృత్యువును జయించు"
అంధకార నిశీథంలో సావిత్రి హృదయం సమాధానం చెప్పిం
"నా శక్తిని పరిగ్రహించి మృత్యువుకు అందించారు

మూతపడిన స్వర్గాలకై ఎలా చేతులెత్తి మ్రొక్కాలను ?
అనివార్యమైన విధితో ఎందుకు పోరాడాలి !
అజ్ఞానంలోవున్న మానవతను ఎందుకు ఉద్ధరించాలి ?
మానవులు కర్మకు తలవొగ్గి, క్రాంతినే హేళన చేస్తారు
మానసిక ప్రజ్ఞ ఒక్కటే శాశ్వతం అనుకుంటారు
నిర్జీవమైన, అచేతనమైన జడత్వమే శాశ్వతమా !
కఠోరమైన శిఖరాలు, అజ్ఞాన తిమిరాలు శాశ్వతాలా !
మనిషి ఆక్రందన విని ఏడించే దేవుడున్నాడా ?
ఆ భగవంతుడు నిశ్చలంగా ఉండి మనిషి స్వశక్తితో
మృత్యువుతో, పరప్రజ్ఞతో పోరాడేటట్లు చేస్తాడు.
ఈ చీకటి తెరను తొలగించి, సూక్ష్మద్వారం తెరచి
మూసుకుపోయిన జీవితంలో ఎందుకు వెలుగునింపాలి?
అత్యల్ప మానవ ప్రపంచంలో అనల్పధర్మం ఎందుకు ప్రతిష్ఠించాలి ?
నాకుగానీ, సత్యవంతునికిగానీ ఆ అవసరం ఎందుకు ?
ఈ భౌతిక శాసనాలతో నేనెందుకు పోరాడాలి ?
మృత్యువు ఆసన్నమయే క్షణాల్ని ఎందుకు తప్పించాలి ?
నేను సైతం విధికి తలవంచి, నా ప్రియుని వెంట
అతని అడుగుజాడలలో పయనించి, అసురసంధ్య నుండి
సూర్యోదయం వరకు, ఈ నిశిలో పయనించి
ఇహపరాలకు మధ్యనున్న వైతరణి దాటిపోతాను.
ఆ చీకటి ప్రవాహం భూమిని స్వర్గాన్ని వేరుచేస్తుంది
ఆ పైన మేము ఒకరి కౌగిలిలో ఒకరం మైమరచి
ఏ ఆలోచనలు, బాధలు, భయాలు లేకుండా
మానవజాతిని, జీవితాన్ని, కాలాన్ని మరచిపోయి
పరబ్రహ్మ, పరమాత్మ పిలుపును విస్మరించి ఉండగలం"
అంతర్వాణి అన్నది, "అది చాలా నీకు, జీవుడా !
నీ ఆత్మ నిద్రమేల్కొని, తాను వచ్చిన పని ఏదీ
పూర్తికాలేదని తెలుసుకున్నప్పుడు ఏం చెబుతావు ?
ఇందుకేనా నీవు భూమిపైన జన్మించింది ?

ఇందుకేనా పరమాత్మ నిన్ను ఇక్కడకు పంపింది ?
అనేక సంవత్సరాలుగా ఈ రోదనలు, వేదనలు వింటూ
ఏవో క్షుద్రదేవతల అడుగుజాడలలో పయనిస్తూ
పాత నియమాలు ఏ మాత్రం మార్చకుండా వెళ్ళిపోతావా !
కొత్తదనం అన్నమాట వినిపించదా, మార్పురాదా !
ఈ లోకం అజ్ఞానం నుండి, అంధకారం నుండి
బయటపడి వెలుగును చూచే అవకాశమే లేదా !
మనిషి ఆత్మ ఇలా 'కర్మ'కు, విధికి తలవొగ్గ వలసిందేనా ?
విధి కవాటాలు తెరవడానికే కదా నీవు వచ్చింది
శాశ్వతంగా మూసుకుపోయిన ఆ ఇనుపద్వారాల్ని తెరచి
అశాశ్వతం నుండి శాశ్వతత్వానికి తీసుకువెళ్ళే
సువిశాల, సువర్ణ పథంలో మనిషిని సత్యంవైపు నడిపించాలి
తద్వ్యతిరేకంగా జరిగినట్లు నేను చెప్పవలసి వస్తే
పరబ్రహ్మ సన్నిధిలో నేను సిగ్గుతో తలవంచాలి.
పరమాత్మ నీకు ప్రసాదించిన శక్తి నిరుపయోగమైనట్లు
నీపని నీవు నిర్వహించకుండా, వెనక్కు వెళ్ళిపోయినట్లు !"

సావిత్రి హృదయం మూగవోయి మాట వెలువడలేదు.
క్షుభిత, కల్లోల హృదయాన్ని నిగ్రహించుకుని
శిలవలె నిశ్చలంగా, గంభీరంగా, ప్రశాంతంగా ఉండిపోయింది.
మానవ అజ్ఞాన మహాసాగారాలకు అతీతంగా
మానవ వాతావరణం దాటిన నిశ్చలశిఖరం అయింది.
తనలోని దివ్యశక్తి, ఆమె నిశ్చలతకు సమాధానం చెప్పింది:

"నేను నీలోని ఒక అంశను, నీ కార్యనిర్వహణే నాది.
నీవు నా వలెనే ఎల్లప్పుడు ఉన్నతంగానే ఉంటావు
ఓ మహత్తర అమరవాణీ! ఆత్మీయంగా మాట్లాడు
నీ సంకల్పం మేరకే నా కర్తవ్యం, కనుక శాసించు"

అంతర్వాణి అన్నది: "నీవెందుకు జన్మించావో తెలుసుకో,
నీ ఆత్మను తెలుసుకో, నిగూఢ ఆత్మశక్తిని గ్రహించు

నిశ్శబ్ద ప్రశాంతిలో భగవంతుని లక్ష్యాన్ని గుర్తించు
అప్పుడు నీ భౌతికత దివ్యత్వంగా మారుతుంది.
భగవంతుని మందిర ద్వారాలు తెరచి సమాధిలో ప్రవేశించు
నీ నుండి ఆలోచనలు దూరంచేస్తే వెలుగును దర్శించగలవు
నీ మనస్సు నిశ్చలం చేసినకొలదీ నిర్మలత్వం ఏర్పడి
పరమసత్యం నీలో నీకే తెలుస్తుంది. నీవే చూడగలవు.

ఆత్మదృష్టికి అవరోధంగావున్న తెరల్ని తొలగించుకో
నీ మనస్సు మహాశూన్యస్థితిని చేరుకున్నప్పుడు
ఈ ప్రపంచంలో పరమాత్మ రూపాన్ని దర్శించ గలవు.
నీ ఆత్మ వినగలిగిన అన్ని శబ్దాలలో పరమాత్మను తెలుసుకో.
ప్రాపంచిక విషయాలలో పరమాత్మ స్పర్శ కనిపిస్తుంది.
అన్ని విషయాలు నిన్ను ఈశ్వరీయతలో బంధిస్తాయి
నీ హృదయస్పందనల్ని జయిస్తే తన్మయత్వం కలుగుతుంది.
పరమాత్మ చేయించే అన్ని పనులకు నీ స్వభావం ఆధారమవుతుంది
పరమాత్మ ఔన్నత్యం నీ మాటలలో అభివ్యక్తమవుతుంది.
అప్పుడు నీవు నా శక్తిని స్వీకరించి మృత్యువును జయిస్తావు"

సావిత్రి విధివంచితుడైన భర్త ప్రక్కన స్థాణువులా
నిశ్చల స్వర్ణమూర్తివలె అంతరంగంలో వెలిగే
అగ్నిజ్వాలకు ప్రతిరూపంగా కూర్చుండి పోయింది.
ఆ అంధకార నిశీథంలో తుఫాను ఆగ్రహించింది.
ఆమెపై పిడుగులు వర్షించాయి, కుంభవృష్టి కురిసింది.
మింటిపైన కోటి కోట్ల అడుగుల సవ్వడి వినిపించింది.
ఆ భయంకర ఘోషలో సైతం ఆమె నిశ్చలంగా వుంది.
తన మనోభావాలను, జీవితంతో సమన్వయించుకుంటూ
తన అంతర్యంలోకి, తన ఆత్మలోకి చూడసాగింది.

సృష్టిలోని గతమంతా స్వప్నంవలె కనిపించింది.
సృష్టికి మూలబీజం, మార్మికమైన ఆది రహస్యాలు
విశ్వకర్మకు నీలినీడల ఆరంభాలు అవి:

నిగూఢసత్యాన్ని చూపిస్తున్న సంకేత జ్యోతిలో
విశ్వవైచిత్రిని ఆమెకు స్పష్టంగా కనిపించింది.
అయోమయంగా, అస్థిరంగా, రూపరహితంగా వున్న స్థితిలో
మొట్టమొదటగా, సృష్టి విచిత్రంగా ఏర్పడ్డది.

అప్పుడే ఆకృతి పొందిన శరీరం జీవికి ఆవాసమైంది
ఆలోచించడం నేర్చుకున్న తర్వాత జీవికి వ్యక్తిత్వం ఏర్పడ్డది
రోదసినిండా జీవబీజాలు ఆమెకు కనిపించాయి.
కాలక్రమేణ మానవరూపం ఏర్పడినట్లు కనిపించింది.
మొదట అనంతంగా వున్న శూన్యస్థితి నుండి
ఒక జీవనఃకెరటం మందంగా కదలాడింది.
ఆ చైతన్యం నిశ్చలంగా వున్న శూన్యంలోకి ప్రవేశించింది
చైతన్య రహితమైన శూన్యంలో సుఖదుఃఖాలు కదిలాయి
అది అంతా ఒక విశ్వశక్తి చాలనం వల్ల ఏర్పడినదే.

ఆ శక్తి తన ప్రమేయం లేకుండానే, జడంగా
సున్న శూన్యం నుండి విశ్వాన్ని రూపుదిద్దింది.
అత్యల్ప జీవుల్ని సైతం అది సృష్టించింది.
అల్పమైన ఇంద్రియ లాలసలు విశృంఖలంగా
'అహం' అనే చిన్న కేంద్ర బిందువుపై గుమిగూడాయి.
వానిలో చైతన్యం గల ఒకానొక జీవం కదలి,
శ్వాసతో జీవించడం నేర్చి, ఆలోచనాజీవి అయింది.
నిశ్చలంగా వున్న ప్రచేతనా జీవసాగరంపైన
రూపరహితమైన చైతన్యం పొంది మేల్కొన్నది.
ఆలోచనలు, అనుభూతులు రాకపోకలు సాగించాయి
జ్ఞాపకాలు నురగలుగా ఏర్పడి, గట్టిపడి,
ఆలోచనకు, వివేకానికి ఆధారాలుగా మారాయి.
అదే వ్యక్తిత్వానికి సజీవ చిహ్నం అయింది.

అలవాట్లు పునరుక్తమై శాశ్వతత్వాన్ని పొందాయి.
చైతన్యమేధ తొలుత చైతన్యరూపాన్ని సృష్టించింది

కరిగిపోయే నేలపై కదిలే గృహాన్ని నిర్మించింది.
లోతు తెలియని సాగరంపై తేలే ద్వీపాన్ని సృష్టించింది.
ఆ కృషి ఫలితంగా ఒక చైతన్యరూపం ఏర్పడ్డది.
అది తన చుట్టూ పరికించగా, కష్టాలకోనలు
అద్భుతమైన కాననాలు, జటిలమైన నేలలు కనిపించాయి.
కృత్రిమమైన భౌతిక అమరత్వం ఆధారంగా
చిన్నిశరీరంతో మనుగడ సాగించదలచింది.
అశాశ్వతమైన తన శరీరమే దివ్యమందిరమైనట్లు
నీలాకాశాన్ని చూసి తన అమరత్వాన్ని కలగన్నది.
నిర్జీవ ప్రపంచంలో చైతన్యవంతమైన జీవం,
మన ఆశల, ఆలోచనల, కలల వెనుక దాగింది.
సృష్టిప్రక్రియలన్నింటిపై పరమాత్మ ముద్రవున్నా,
తన ప్రతినిధి అయిన మేధస్సుదే ఇక్కడ ఆధిపత్యం

కాలప్రవాహంపైన తేలిపోయే మందిరంలోవుండి
మనస్సు విరామంలేకుండా పరిశ్రమిస్తుంది.
కాలపురుషుని నర్తనంలో అది ఒక కీలుబొమ్మ.
అది అనుక్షణం కాలంతోనే కదులుతుంది,
జీవి అవసరాలను గుర్తెరిగి ప్రవర్తిస్తుంది.
ప్రపంచ అవసరాలకు తగినట్లు ఆలోచిస్తుంది
ఈ మనస్సుకు ప్రశాంతిలేదు, విశ్రాంతి ఉండదు
మేధలో ఆలోచనలు సుడులు తిరుగుతుంటాయి.
ఆ మేధ యంత్రం ఎలా పనిచేస్తుందో కానీ ఆగిపోదు.
ఈ శరీరంలోని అన్ని కోశాలలోకి అనంతంగా
దివ్య స్వప్న సందేశాలను సరఫరా చేస్తుంది.
అవిఅన్నీ కోటి గొంతుల కలస్వరాలు, కలకలాలు
ఆలోచనలన్నీ అలుపటలేని ఉరుకులు, పరుగులు
అన్నీ తీవ్ర ప్రచలనాలు, నిర్విరామ ప్రకంపనలు
బాహ్యద్వారం వద్ద వినిపించే ప్రతిపిలుపుకు
స్పందిస్తూ, అవసరాల్ని అందుకుని పైకి అందిస్తుంది.

వేల సందేశాలకు సమాధానం అందిస్తుంది.
ఇంద్రియ వ్యాపారాన్నీ తన ద్వారానే కొనసాగిస్తుంది.
నిద్రించే సమయంలో రవంత విశ్రాంతి తీసుకున్నా
చిత్రమైన స్వప్నాలతో జీవితాన్ని విమర్శిస్తుంది.
అది సూక్ష్మలోకంలో సంకేత దృశ్యాలమధ్య తిరుగుతూ
అస్పష్టరూపాలను, స్పష్టాస్పష్ట దృశ్యాలను చూచి
మనుషుల మనోరూపాలను సంస్కరించ యత్నిస్తుంది.
అది ప్రశాంతంగా ఒక్కక్షణం కూడా ఉండదు
అనంత మనోసామ్రాజ్యంలోకి చొచ్చుకుపోయి
అక్కడ తన భావవిహంగాలను విప్పుతుంది.
లేక, ఆలోచనారథంపై పయనించి భూమిని,
ఖగోళాన్నిదాటి, సూక్ష్మలోకాలకు చేరుతుంది.
అద్భుతజీవ శిఖరాలపై దేవతల్ని దర్శిస్తుంది,
స్వర్గంతో చెలిమిచేసి నరకంతో ఊసులాడుతుంది,
అది మానవజీవితపు ఉపరితల నిర్మాణం

మనస్సే మనిషి, మనస్సే సమస్త విశ్వం
అది పరమాత్మను చూడగలదు, అఘాతాలుచేరగలదు
దానిలోపలనే ఒక విచిత్రమైన లోకం వున్నది
మనస్సుకు తెలియకుండా, రహస్యమందిరాలలో
తెరచాటున మరొక మహాశక్తివుంది.
అది జీవునికి కనిపించని ఆనందాలను పొంది
ప్రశాంతి అందించే మధువుల్ని త్రాగి జీవిస్తుంది.
ఒక అనామక దివ్యత్వం, అందనంత దూరంలో
ఆత్మ అంతర్మందిరాలలో అతి నిగూఢంగా,
జీవుని రహస్యాలన్నింటినీ రక్షిస్తూ వుంటుంది.
చీకటి ద్వారాలు దాటి ముమ్ముందుకు పోవాలి,
ప్రగాఢ సుషుప్తి సీమలలో అది దాగివుంటుంది.
విశ్వమోహన మూర్తి అయిన ఆ మహాపురుషుడు
తన మహత్తును, ఔన్నత్యాన్ని, వెలుగును

పవిత్రుడైన మనిషి ఆత్మలోకి పంపిస్తాడు
అనంతకాలాన్ని తనలో సృష్టించుకుని
స్వచ్ఛమైన అద్దంలో ప్రతిఫలింపచేస్తాడు
మనిషి చేసే పనులన్నీ. భగవంతుడు కన్నకలలే :

భగవంతుని వైరుధ్యాలతో సహా అన్నీ అక్కడ వున్నాయి
ప్రకృతిలోని అన్ని కృతులకు అది ఒక సంక్షిప్తరూపం
అతి నిగూఢ శక్తికి అది ఆలోచనా రూపం.
మనిషిలో వ్యక్తమయ్యేదంతా ప్రకృతిలో వున్నదే.
ప్రకృతిలోని చీకటి వెలుగులే మనిషిలో ప్రవేశిస్తాయి.
మానవజీవన మందిరం దేవతలకే నిలయం కాదు.
అందులో అతీంద్రియశక్తులు, మహత్తరశక్తులు ఉన్నాయి.
అందులోని అతిభయంకరమైన చీకటి గదుల్లో
అధోలోకాల, క్రూరశక్తులు కొలువుంటాయి.

తనలో వున్న ప్రకృతి శక్తుల్ని కాపాడుకోలేక
మనిషి ప్రమాదకరశక్తుల్ని ఆహ్వానిస్తాడు.
చీకటి గుయ్యారంవంటి గుహలో పాశవిక
ఆటవిక. రాక్షసప్రవృత్తులు నిద్రిస్తుంటాయి.
ఎట్ట ఎదుట పశుత్వం బుసలుకొడుతుంది.
అవి మత్తుగా, మగతగా నిద్రిస్తూ మూలుగుతుంటాయి.
ఒక్కొక్కసారి తిరగబడి తల ఎత్తినప్పుడు
జీవునిలో ఎక్కడోవున్న రాక్షసత్వం విజృంభిస్తుంది.
అంధకార అధోలోకాల తలుపులు తెరుచుకొని
రాక్షస ప్రవృత్తులు ఒక్కసారిగా బయటకొస్తాయి.
తనలో అణగి మణగి వుండవలసిన క్షుద్రశక్తులు,
అతనిపై ఆధిపత్యం పొంది, అతనినే శాసిస్తాయి.
అవి ఒక్కుమ్మడిగా శరీరంపై దాడిచేసి
అతని ఆలోచనల్ని జీవితాన్ని. క్రియల్ని మార్చివేస్తాయి.
మానవ జీవితం నరక సదృశమవుతుంది.
అన్ని కోణాలలో ప్రతికూలత ఏర్పడుతుంది.

మూసివున్న మందిర ద్వారాలగుండా, దుర్గంధంవలె
దుష్టశక్తులు నెమ్మదిగా లోపల ప్రవేశిస్తాయి.
అతను సుఖంగా, సంతోషంగావున్న మందిర
కుడ్యాలను విచ్ఛిన్నంచేసి, కలుషితం చేస్తాయి.
పాపపు మరకల్ని, మృత్యుచారికల్ని వేసిపోతాయి.
అతనిలో కలుషితమైన ఆలోచనలు, తలయెత్తి
అనేకానేక దుర్గుణ ప్రభావాలకు లోను కావడమే కాక,
అనేక వికృత రూపాలు, దృశ్యాలు ప్రత్యక్ష మవుతాయి.

అంతవరకు ఉన్న దివ్యరూపాలన్నీ తప్పుకుని
అప్పుడప్పుడు జీవితంలోకి తొంగిచూస్తుంటాయి.
లేదా, ఏదో సత్కార్యంకొరకు క్షణకాలం వచ్చి,
అతని హృదయం తమదే కదా అని అనుకుంటాయి.
పుగత తొలగిపోగా, వాటి ప్రభావం ఏ మాత్రం ఉండదు.
ఈ అంధకార క్షుద్రశక్తులు కోరిన వెంటనే
రాత్రనక, పగలనక, శరీరంపైన ఆవహించి
భగవంతుని వెలుగులో ప్రవేశించి, కల్లోల పరుస్తాయి.
అవి తమకు అందిన మేరకు స్వంతం చేసుకుంటాయి.
ప్రకృతినైజంలో ఉంటూ, మనోమార్గాలను నింపి
ఆలోచనల్ని కకా వికలంచేసి, కల్లోలపరచి
అరుపులతో, కేకలతో ఆత్మప్రశాంతిని భంగపరచి,
నరకంలోవున్న క్షుద్రశక్తుల్ని ఆహ్వానిస్తాయి
పాపకృత్యాపట్ల, సుఖాలపట్ల ఆసక్తి కలిగించి
రాక్షసానందంపట్ల అమరక్తి రగిలించి
జీవితాన్ని కూకటివేళ్ళతో కబళించివేస్తాయి.
ఈ భయంకర బందీల కోర్కెలు తీర్చేశక్తి లేక
జీవుడు నిస్సహాయంగా పైపైన తిరుగుతాడు
ఒకప్పుడు తనదైన దేహం ఇప్పుడు తనదికాదు.
ఆ శక్తులు ఆడించినట్లు ఆడి బలై పోతాడు.
ఆ మురికికూపంలోని సుఖాలతో మురిసిపోతాడు.

అతని స్వభావంలోని భయానక శక్తులే విజృంభించి
తమ ఇష్టప్రకారం తిరుగుబాటుచేసి ఆనందిస్తాయి.
అంతవరకు అట్టడుగున, చీకట్లలో దాగిన శక్తులు,
అదృశ్యంగా వున్నవే, ఒక్కసారి బయటకొస్తాయి.
అతని సహజ బలహీనతలే ఇప్పుడు అతన్ని నడిపిస్తాయి.
అంతవరకు అణగి మణగి మారుపేర్లతో,
మారు రూపాలతో మసలుతున్న క్షుద్రశక్తులే అవి.
మనిషి అల్పపైజం ఈ క్షుద్రశక్తుల్ని పోషిస్తుంది.
అవి మూకుమ్మడిగా మానవ ప్రపంచాన్ని కబళిస్తాయి.
అవి ఎదురు తిరిగి మనిషి ఆత్మను స్వాధీనం చేసుకుంటాయి.
ప్రతి మనిషిలోను ఈ తిరుగుబాటు తలెత్తుతుంది.
యమకింకరులు తమ ఇష్ట ప్రకారం ప్రవర్తిస్తారు.
అన్ని ద్వారాలనుండి వారు భౌతిక జీవితంలో చొరబడతారు
రక్తదాహంతో, హత్యాభిరతితో, మనిషి శరీరంపై
దాడిచేసి భగవంతుని సృష్టిని నాశనం చేస్తారు.
మృత్యువు, యమకింకరులు భూమిపైకి దండెత్తిరాగా,
భయంకర మృత్యుదేవత ప్రతి ఇంటితలుపు తడుతుంది.
ప్రపంచ బాధల్నిచూసి వికటాట్ట హాసం చేస్తుంది.
స్వర్గాన్ని చూపి నరకయాతనలకు గురిచేస్తుంది,
ఆ విలయశక్తికి సర్వం ఆహుతి కావలసిందే
సృష్టిసైతం ఆ పాద శిఖరం చలించిపోతుంది,
మానవ హృదయాలలో ఈ పాప స్వభావం
ప్రమాదకరంగా, అంటీముట్టనట్లు ఉంటుంది.
దానికి ఆశ్రయమిచ్చిన ఆత్మ దాన్నితొలగించగలదు
దానిని శరీరంనుండి తరిమి తాను ఆక్రమించగలదు.
భగవచ్ఛక్తికి పోటీగా నిలిచిన ప్రతికూలశక్తి
తాత్కాలికంగా పాపాన్ని సర్వశక్తి వంతంచేసి
ప్రకృతిలోని రహదారులను కల్లోల పరుస్తుంది.
అది త్రోసివేసిన దివ్యత్వాన్నే అనుకరిస్తుంది.

తానే భగవంతుని రూపం ముసుగువేసుకుంటుంది.
తానే సృష్టికి కర్తనని, లయకారకుడని చెప్పి
మనిషిని, మానవప్రపంచాన్ని నిర్మూలించ పూనుకుంటుంది.
అయినా లోకాన్ని రక్షించగల శక్తి మరొకటి వుంది.
మనిషిని ఉద్ధరించగల పరాశక్తి ఒకటి వుంది.
మానవ రంగాన్ని భగవంతుడు గమనిస్తూనే వుంటాడు.

ఒక వృక్షం మొత్తం దాని బీజంలో నిక్షిప్తమైనట్లే
సృష్టిలోని సంభవాలన్నీ మనిషిలో దాగివున్నాయి.
మనిషిలో గతం వుంది. అదే భవిష్యత్తుకు బాట వేస్తుంది.
అతని వర్తమాన కర్మలు భవిష్యత్ విధిని ఏర్పరుస్తాయి
జీవన మందిరంలో జన్మించని దేవతలు దాగివుంటారు
అగోచర రాక్షసులు అతని మనస్సును ఆక్రమిస్తారు
తమ కలల్ని, అతని ఆలోచనల్లో సజీవంగా మలుస్తారు
ఆ రూపాలలో మనిషి మేధ తన లోకాన్ని నిర్మించుకుంటుంది.
మనస్సు తన చుట్టు ఒక ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది.
అన్నీ వున్నవే అతనిలో పునర్జన్మ ఎత్తినట్లవుతాయి
రూపం ధరించగలవే ఆత్మకు అవగతం అవుతాయి.
విశ్వవీధులలో అది అనంతంగా సృష్టిస్తూపోతుంది
అవి వివేకానికి, అంచనాలకు అందవు

అవి క్షుద్రశక్తులు రహస్యంగా వాంఛించే ప్రయోజనాలు.
ఆ జటిల పథకం విచిత్ర రీతులలో సాగుతుంది
దాని లక్ష్యం ఏదో మనిషి దృష్టికి అందదు
పరమాత్మ సంకల్పం ఏదో దూరంగా కనిపిస్తుంది
జీవితంలో ఒక మహత్తర అవకాశం ఏర్పడినప్పుడు
అది స్తిమితపడి, తన గమ్యంపైపు సాగిపోతుంది.
మన వివేకం బాహ్య విషయాలనే తెలియచేస్తుంది
కాని అదృశ్యంగా పరిప్రజ్ఞ మనల్ని ఆక్రమించి
కాలంలో జరిగిపోయిన విషయాల్ని నమోదుచేస్తుంది
జీవితంలోని మలుపులన్నీ అసంకల్పిత చర్యలే!

మనలో ఏ కొద్దిమందో భవిష్యత్తును చూడగలరు
కొందరికే స్థిరసంకల్పం, జీవితం లక్ష్యం ఉంటాయి
మనిషి నిర్వహించవలసినది ఎంతగానో వుంది.

కాని తను ఉన్నది మాత్రం గాఢాంధకారగుహలో
కాలగమనంలో అన్నీ కరిగిపోయినట్లు తోచినా
మన ఆంతర్యంలో గత జన్మల ఛాయలుంటాయి
కనిపించని ఆ గతజన్మల ప్రభావంతోనే
భవిష్యత్తులో మన ఆత్మ—పరిశోధన జరుగుతుంది
కనుక, జన్మలు, సంఘటనలు ఒక గొలుసు గొళ్లాలే,
కాని ఎప్పటి కప్పుడు కొత్తగా జరుగుతున్నట్లు అనిపిస్తాయి
మనం మరచిన పురాకర్మలే పునరావృత్తం అవుతాయి
మన గతమే భవిష్యత్తుకు పదకంకణ నిక్వాణాలు
కొత్త జీవితంలో వేగాన్ని 'గతం' వెనక్కు లాగుతుంది

పాతిపెట్టబడిన శవాలనుండి భూతాలు లేస్తాయి
మన భావాలు, ఇష్టాలు, ప్రేమలు అన్నీ అప్పటివే.
అవి నిద్రలో కనిపించి. మనస్సును మేల్కొల్పుతాయి.
అవి పెదవులు దాటి మాటలరూపంలో వెలువడతాయి
ఆయా పనుల్ని అప్రయత్నంగా, ఆనాలోచితంగా చెస్తాం
మనిషి సంకల్పాన్ని, వివేకాన్ని అవి మార్చివేస్తాయి.
మన ప్రస్తుత వ్యక్తిత్వంలో గతం కదలాడుతుంది.
ఒకనాటి మనదైన వ్యక్తిత్వాన్ని ఇప్పుడు త్రోసివేయలేం.
మన జీవన సరళిలో అవి స్పష్టాస్పష్టంగా కనిపిస్తాయి
మన అంతరంగంలో చీకటి పంచలలో దాగివుంటాయి
అన్నీ నరాశయం నడిపించినట్లే నడుస్తుంటాయి.
అంతర్మేధ వాటిని అదుపు చేసి శాసించదు.

ద్వారాల వద్దనున్న రక్షకులు వాటిని పట్టించుకోరు
జ్ఞాపకాలు సైతం వాటిని పట్టించుకోనట్లు వదలివేస్తాయి
విస్మృతిలో నిరుపయోగంగా ఉన్నవన్నీ తలెత్తుతాయి

ఒకప్పుడు ఉన్నవి ఏవీ పూర్తిగా నశించిపోవు.
ప్రపంచంలోను మనలోను, చీకటి మూలల్లో
గతం తిరస్కరించిన నైజం కదులుతూ ఉంటుంది
నిహతమైన ఆలోచనల అవశేషాలు తలలెత్తుతాయి.
నిద్రలోకి నిరాటంకంగా నడచి వస్తుంటాయి
అవి ప్రేరణలు కలిగించి, రగిలించి, ఉద్దీప్తాలై
ఒక అద్భుత ప్రపంచమనే భ్రాంతిని కల్పిస్తాయి
ప్రకృతి సంఘటనల్ని ప్రతిఘటించలేం
మిగిలిపోయిన పాపాలు బీజాలై ఇక్కడ మొలకెత్తుతాయి
ఒకప్పుడు అలక్ష్యం చేసిన పాపం ఇప్పుడు ఎదుర్కొంటాం
గత జన్మకృత పాపాలు ఈ జన్మలో ఆత్మను పట్టుకుంటాయి
గతంలోని జీవిత శేషమే ప్రస్తుత జన్మ అవుతుంది
అది అజ్ఞాతంగా, అజ్ఞానంలో పెరుగుతూ వుంటుంది
చీకట్ల నుండి, అజ్ఞానం నుండి వెలుపడిన మనం
అస్పష్టమైన మనోకాంతిలో జీవిస్తూనే క్లిష్టమైన
ప్రపంచాన్ని జయించాలని, తెలుసుకోవాలని ప్రయత్నిస్తాం:
కాని సృష్టి రహస్యం మన దృష్టికి అందదు.

మనపైన పారలౌకికమైన దివ్యత్వం ఉంటుంది
అది పరమాత్మ వెలుగులో గుప్తంగా ఉంటుంది
మనచుట్టు పరచుకున్నది సువిశాలమైన అజ్ఞానం
ఈ అజ్ఞానానికి మానవ మేధ వెలుగు చూపిస్తుంది.
మనకు దిగువన అజ్ఞానం చీకట్లలో నిస్తబ్దంగా వుంటుంది.

ఇది భౌతిక పదార్థపు తొలి ఆత్మ పరిశీలన
ఇది అ-జ్ఞానంతో అంచెలంచెలుగా వేసుకునే అంచనా
కాని ఇదే మన ప్రపంచం కాదు. ఇదే జీవితమూ కాదు
మహత్తర ఆత్మజ్ఞానం మనకొరకు సిద్ధంగా వుంది
సత్యచైతన్య సీమలకు చేర్చే వెలుగు వేరే ఉంది.
అది ఆలోచించే మేధకు ఆవల శిఖరాలపై ఉంటుంది.
అది అతీంద్రియ జీవన తేజస్సుతో భాసిస్తుంది.

అదే అవతరించి, ఇక్కడి జీవితాన్ని దివ్యంగా మార్చాలి.
ఈ లోకాన్ని సృష్టించింది సత్యంగానీ అంధ ప్రకృతిశక్తి కాదు.
ఇక్కడ మనం చేరపలసిన ఔన్నత్య శిఖరాలు లేవు
మనం ఎక్కవలసిన శిఖరాలు, పరప్రజ్ఞా భాస్వరాలు
అవి పరబ్రహ్మ సమక్షంలో పరుచుకున్న వెలుగులు
మనం ఆశించే అమరత్వం, శాశ్వతత్వం అక్కడేవుంది
మనపైన అమృత రూపాలు అక్కడనే కనిపిస్తాయి.
అక్కడికి జరామరణాలకు అతీతమైనస్థితి
మనం మత్యువును, కర్మను జయించినప్పడే ఆనందం
అప్పుడే సచ్చిదానందం, అమరత్వం, ఓజస్సు లభిస్తాయి.
ఈ కోశాల వెనుక బ్రహ్మపదార్థం దాగివుంటుంది.

మనలో నిగూఢంగా అనేక మహత్తులు ఉన్నాయి
అవి సమయం వచ్చినప్పుడు బయటపడతాయి
మనలోని దేవుళ్ళెవరో సహాయం చేస్తున్నారనుకుంటాం
అంతర్వాణి పలుకుతుంది, పైనుండి వెలుగు అందుతుంది.
మన ఆత్మే మార్మికమందిరంలో పని ప్రారంభిస్తుంది
దాని ప్రభావం మన మనస్సుపైన, హృదయంపైన ఉంటుంది
అపుడు మనం మానవ పరిధుల్ని దాటి పైకి పోతాం.

ఆత్మ మంచిని, సౌందర్యాన్ని, పరమాత్మను వెదుకుతుంది.
ఈ శరీరాన్ని దాటిన తర్వాత ఆత్మ అనంతత్వాన్ని గమనిస్తాం
ఈ ప్రపంచం అద్దంలో అన్నీ సగం సగమే కనిపిస్తాయి
దృశ్యప్రపంచానికి ఆవల అసలు సత్యానికై అన్వేషిస్తాం.
మన అంతర్మేధ పరంజ్యోతిలోనే ఉంటుంది.
వాటికాంతులు గుప్తద్వారాల ద్వారా కనిపిస్తాయి
ఆ గుప్త మందిర ద్వారం వద్దనే తేజశ్శరీరులు
ప్రజ్ఞా ప్రపూర్ణులు తిరుగుతూ కనిపిస్తారు.
వారి తేజస్సు మన శరీరంలో బాహ్య స్పర్శకు అందినప్పుడు
మనం తలఎత్తి ఆ జ్యోతిని దర్శిస్తాం
మనం 'మహాజీవితం' అని మురిసిపోయే ఈ అల్ప జీవితం

వెనుక మహత్తర శక్తులు గల మరో జీవితం వుంది
అంటే మనం రెండు రెక్కలపైన పయనిస్తున్నాం.
ఈ శరీరంలో 'సూక్ష్మ శరీరం' బయటకు కనిపించదు
ఏ అదృశ్య మందిరంలోనో ఉండి, స్వప్నంలో దర్శనమిస్తుంది.
అవి పరబ్రహ్మ భావనలకు స్వచ్ఛమైన ఛాయలు.

మానవజాతి ఆవిర్భవించిన తొలి నాళ్ళలో
మనిషి వంగిపోయిన వానరుడు, తర్వాత
నిటారుగా నిలిచి, దేవతారూపాన్ని, శక్తిని పొందాడు.
అతని కన్నులలో ఆత్మ, ఆలోచనలు తొంగిచూచాయి.
అప్పుడు నిటారుగా నిలిచి, భృకుటి ముడిచి ఆలోచించాడు.
ఆకాశంలోకి చూచి, నక్షత్రాల్ని గమనించాడు
తన జన్మ ఔన్నత్యం, సృష్టి సౌందర్యం కనిపించాయి
నెమ్మదిగా తన హృదయమందిర తేజస్సును వదలి
మహత్తరమైన స్వప్న వీథుల విహరించసాగాడు.
తన ఆత్మ తెలుసుకోదగిన లోకాలున్నవని గ్రహించాడు
తనకు తానై, క్షుద్రదేవతగా చీకటిలో జీవించాడు
కానీ, తన లోని అంధకార మందిరాలనుండి
సృష్టి అన్వేషణకై బయటపడక తప్పలేదు.
సుదూరశబ్దాలు విని, ఆగోచరాన్ని అందుకో చూచాడు
భవిష్యత్తులోని, అదృశ్యలోకంలోకి తొంగిచూచాడు
అ-భౌతికమైన శక్తుల్ని సాధనాలు చేసుకున్నాడు.
అసంభవాలను వెదకడమే వ్యాపృత్తి అయింది.
పరబ్రహ్మాంశల్ని చెదురుమదురుగా గమనించి
వాటి ఆధారంతో విశ్వశక్తుల్ని అంచనా వేశాడు.

అలా మనిషి భౌతిక శరీరంలో జీవిస్తూ,
పరమాత్మను గురించి పరుగులు తీయసాగాడు.
కనిపించని స్వర్గాన్ని గురించి కలలు కనసాగాడు.
తన మనస్సుతోనే పరలోకాలను దర్శించి
ఈ చిరుగోళంపై అనంత విశ్వాన్ని సంభావించాడు.

ఈ సంకుచిత మార్గంలోనే దీర్ఘకాలం పయనించి
విశ్వ శిఖరాగ్రంపైన ఒంటరిగా నిలుస్తాడు
అక్కడ ఆధ్యాత్మిక సూర్య తేజస్సును దర్శిస్తాడు.
సంకల్ప బలంతో ప్రాపంచికతను దాటి పోగలడు
ఆత్మ సామ్రాజ్యంలో పునర్జన్మ ఎత్తినట్లు ఉంటూ
భౌతిక బంధనాలనుండి విముక్తి సాధించగలడు.
స్వచ్ఛంద స్వతంత్ర ఆత్మలోకంలో జీవించగలడు.
పరలోకాలలో ప్రత్యేకజీవిగా మనలగలడు.
చివరకు దివ్యత్వపు సుదీర్ఘ మార్గాలను వదలి
సున్నితమైనదారం ఆధారంగా తన మూలాధారం చేరతాడు,
అలా తనవైన అమరభూముల్ని చేరుకుంటాడు
తన భౌతిక జీవనంలోకి భగవంతుని ఆహ్వానిస్తాడు.

సావిత్రిలో గుప్తంగా వున్న శక్తి ఈ పనులన్నీ సాధించింది.
తన మానవ శరీరంలో తాను ప్రవేశించినట్లు
జగన్మాత అంశ కొంత ఆమెలో ప్రవేశించింది.
దేవతలు నిర్వహిస్తున్న సృష్టి. కార్య నిర్వాహణలో
ఒక మహత్తర కార్యానికి ఆమె కేంద్రమైంది.
ఆమె ఆత్మ దూరదృష్టితో సంకల్పించిన మహత్కార్యం
మానవతను పరమాత్మ స్వస్వరూపంగా తీర్చిదిద్దటం
అంధకారంలో అలమటిస్తున్న విశ్వానికి వెలుగు ప్రసాదించడం
లేదా మరొక కొత్త ప్రపంచాన్ని సృష్టించటం, కనుగొనడం.

ఈ భూమి పరిణామం చెంది స్వర్గంతో సమానం కావాలి
లేదా, స్వర్గం ఈ భౌతికస్థాయికి, స్థితికి దిగిరావాలి
ఆ మహత్తర ఆధ్యాత్మిక పరిణామం కలగడానికి
మనిషి మార్మిక హృదయ కుహరాలలో దాగివున్న
దివ్య ప్రకృతి 'మాయ' తెరను తొలగించుకుని
మానవ సహజమైన ప్రవృత్తిలో ప్రవేశించాలి.
మానవ స్వభావంలో నిష్కల్మషంగా నిలబడాలి

ఆలోచనల్ని జీవితాన్ని శరీరాన్ని ప్రభావితం చేయాలి.
పరమాత్మ శాసనం ఔదలదాల్చి ఆమె నిశ్చలంగా కూర్చున్నది:

కాలం, జీవితం, మృత్యువు అన్నీ వచ్చిపోయేవే,
వాటి ప్రాపంచికత, ఆమె దృష్టికి అవరోధం కాదు
దివ్యదృష్టి లేని సామాన్య మానవునిలో వున్న
దివ్యత్వాన్ని మేల్కొల్పడానికి ఆమె దివ్యదృష్టి సిద్ధమైంది.
స్వార్థపరత్వం అజ్ఞానపు ముసుగు ధరించి నంతకాలం
ఆమె ఆత్మను మాయ కప్పివుంచింది, దానిని తొలగించి,
ఆమె తన 'ఆత్మ దర్శనం' చేసుకోవలసి ఉంది.

# గవేషణ

బాహ్య ప్రపంచాన్ని మరచి, అంతర్లోకాలలో తనను తాను అన్వేషించడం ఇప్పుడు సావిత్రికి ఎదురైన సమస్య. ఈ విధమైన ఆధ్యాత్మిక జిజ్ఞాస, తపన, అన్వేషణ, సాధన లక్ష్యానికి దగ్గరగా చేర్చుతుంది, ఈ అన్వేషణలోని అనుభవాలు, అనుభూతులు మాటలకు, వర్ణనలకు అందేవి కావు. కంటికి కనుపించే వాటినే సంపూర్ణంగా మాటలతో వర్ణించలేని మనం, అంతర్దృష్టికి అనుభూతమయ్యే వాటిని ఎలా వర్ణించగలం, అసాధ్యమే. అందుకే వాటిని అంతర్లోకాలు అంటున్నాం.

ఈ గవేషణలో సావిత్రికి అంతర్వాణి సహకరించింది. "మానవుడు దివ్యుడు కావడానికి నీ సహాయం అవసరం సావిత్రీ ! వ్యక్తిగతంగా ముక్తిని సాధించుకొనడం నీ లక్ష్యం కాదు" అని సలహా చెప్పింది అంతర్వాణి. అంటే తనకు, తన ప్రియతముడైన సత్యవంతునికి ఏర్పడ్డ కష్టాలు, తమను అలముకున్న చీకట్లు, క్రమ్మిన విషాదం మానవ సహజమని, వాటినుండి మానవునికి విముక్తి కలిగించడమే తన కర్తవ్యమని హెచ్చరిక.

అంతర్లోకాలలో మొదటగా సావిత్రి కనుపించని ఒక సింహద్వారం చేరుకున్నది. తలుపులు ఎక్కడవున్నాయో తెలియదు. అవి మూయబడివున్నాయి. లోపల నుండి ఒక హెచ్చరిక 'ప్రవేశం నిషిద్ధం" అని వినిపించింది. ఆ ప్రవేశ ద్వారాన్ని రక్షిస్తున్న ఒక మహాసర్పం బుసలు కొడుతూ పైకి లేచింది. సావిత్రి భయపడలేదు, చెదరలేదు, బెదరలేదు, లక్ష్యాన్ని వదులుకోలేదు,

ఆ ద్వారాన్ని దాటి ముందుకుసాగింది. ఆ తొలి ద్వారాన్నిదాటడానికి ఎవరికై
స్థైర్యం, ఆత్మనిగ్రహం, సాహసం అవసరం. అక్కడి శక్తులు మనల్ని ని
ధించవు గానీ భయపెడతాయి. ధైర్యంగా నిలిచి, ముందుకు సాగిపోతే అ
అశక్తాలై సమసిపోతాయి.

ఆ తర్వాత అతీంద్రియ, అంతర్లోకాలు ఒక్కటొక్కటిగా ఆమెకు దర్శ
మిచ్చాయి. అవి సావిత్రి అనుభవానికి కొత్త. మొదటిదైన సూక్ష్మ ప్రపంచ
అతి సూక్ష్మ పదార్థ నిర్మితం. అక్కడ ఏదీ స్పష్టంగా కనిపించదు. కారణ
ఏ ఇద్దరు సాధకుల అనుభూతులు, అనుభవాలు ఒకటిగా ఉండవు కను
ఆ తర్వాత జీవంతో తొణికిసలాడే క్రాంతి లోకాలు కనిపించాయి.

అక్కడ సావిత్రికి బీజాక్షరాల అవసరం ఏర్పడ్డది. అవి ఏవి కా
పరమాత్మకు సంకేతాలే గద ! నామోచ్చారణ వల్ల అనల్పమైన శక్తి చేకూరిం
ఆ ఒక్క శక్తితోనే పరలోకంలో 'ఆధ్యాత్మ జీవులు' బ్రతుకుతున్నారు. అక్క
భయం, ఆనందం, నిరాశ, బ్రహ్మానందం అన్నీ వున్నాయి,

సావిత్రి అక్కడి బాధలన్నీ ఎదుర్కొని పైలోకాలు చేరింది. చివర
తేజోలోకం ప్రవేశించింది. అది వివేక మండలం. అక్కడనుండి ఒక
సాహసంతో 'మృత్యువు'ను దాటిపోవచ్చు. కానీ సావిత్రి మెల్లగా ముందు
సాగింది. అక్కడ తేజశ్శరీరులు దర్శనమిచ్చారు. వారంతా సూక్ష్మదేహుల
వారి వద్దనే ఉండిపోవాలనిపించింది. కానీ తన అన్వేషణ పూర్తికాదే ! ఆ తే
మూర్తులు తనకు సాయం చేస్తారని ఆశించింది.

రణగొణధ్వనులు దాటి నిశ్శబ్దగుహలో ప్రవేశించినట్లు
క్షణమాత్రపు అంతరవలోకనతో ఆమె మానసిక
కల్లోలాలనుదాటి ఆత్మ శూన్యస్థితిని చేరుకున్నది.
మహానిశ్శబ్దం ఇప్పుడామెకు ఆవాసమైంది:

ఆమె మనసిప్పుడు నిరాలోచనా మయమై
అనంతమైన శూన్యపు లోతులను వెదకసాగింది.
ఆమె చైతన్యాలు నశించి లోతులు సైతం శూన్యాలైనాయి.
అన్నీ ఆమెనుండి దూరమై ఆమెకు శూన్యాన్ని మిగిల్చాయి.

ఆమె తిరిగి ఆలోచించగల స్థితికి చేరినప్పుడు
తిరిగి భూ ప్రపంచంలోని ఒక సామాన్యవ్యక్తి అయింది.
ఇంత భౌతికపదార్థం, పరిమిత దృష్టిగల ఆశ్రయం
ఇక్కడ మేధ అజ్ఞానం గురించే ఆలోచిస్తుంది.
జీవశక్తి ప్రాపంచిక క్రియలకే పరిమితం
భౌతిక ప్రపంచం ఆమె పరిధిని పరిమితం చేసింది.
కనుపించే మూర్తినే ఆత్మగా భ్రమించే గతం నుండి
మానవ అజ్ఞానపు అయోమయస్థితినుండి
ఆశ్చర్యంగా, అమాయకంగా ఆమె ముందుకు సాగింది.

రహస్య శిఖరాలపై కొలువుండే దివ్యవాణి వినిపించింది:
"నీ అన్వేషణ నీ కొరకు కాదు సర్వమానవాళి కోసం
భగవంతుడు మానవమేధగా పరిణమించి
ఈ ప్రాపంచిక అజ్ఞానపు ముసుగును ధరిస్తే
వామనరూపం ధరించి మూడడుగులతో
మనిషిని భగవంతునిగా మార్చగలుగుతాడా ?
మానవునిలో అజ్ఞాతంగా, సృష్టి ఔన్నత్యం సాగుతూవుంది.
అది మనిషికందని మార్మిక ద్వారాన్ని కనుగొని
పరమాత్మ బంగారువాకిళ్లను తెరుస్తుంది.
భగవంతుని విధానాలనే మనిషీ అనుసరిస్తాడు.
అతని అంధత్వాన్ని గుర్తించి, నీవుగా వెలుగును ప్రసాదించాలి.
అతని విషాదం గమనించి, ఆనందాన్ని పంచిపెట్టాలి.
భౌతిక శరీరంలోనే దివ్యమైన ఆత్మను గుర్తించాలి.''

అప్పుడు సావిత్రి తన శరీర ఆవరణ వదలిపెట్టి
తనదికాని శూన్యంలో కొంత దూరంగా నిలిచి,
తన సూక్ష్మశరీరపు లోతుల్ని నిశితంగా పరిశీలించింది.
సూక్ష్మ శరీర హృదయమధ్యంలో ఒక పద్మం మొగ్గవలె
నిగూఢంగా, గుప్తంగానున్న ఆత్మ దర్శనమైంది.
అంతర్లోకపు చీకటి గవాక్షం వద్ద ఈ శరీర

మేధలో లోతులకు వెళ్ళకుండా నిరోధించింది.
శరీరశ్వాసతోనే జీవజాలం అంతా జీవిస్తున్నది,
ఆమె ఆ నిగూఢమైన ద్వారాన్ని తట్టి కదలించింది.
ప్రాణంతోవున్న ద్వారాలు బుస్సుమని ఆక్రోశించాయి.
ఒక జీవి దౌర్జన్యంగా తనను కదలించడంతో
పై ముఖ్యంతో అంతరంగానికి ఫిర్యాదు చేశాయి.

లోపలనుండి ఒక నిషిద్ధ స్వరం వినిపించింది:
"వెనక్కు వెళ్ళిపో, భూచరమా ! లేకుంటే నానా
హింసలపాలై, కృశించి, మరణం పాలవుతావు."

చీకటి సాగరం వలె భయంకర శబ్దం వెలువడింది.
ద్వారం వద్దనున్న నాగుబాము బుసకొట్టింది.
అది భయంకరంగా పడగవిప్పి కోరలు సాచింది.
చీకటి రక్కసులవలె భీకరంగా గర్జించింది
బుసలుకొడుతూ ఆవేశకావేషాలను చిమ్మింది.
ఆ భయంకర హాహాకారాలకు ఆమె రక్తం మరిగింది.
దాని నాలుక రానున్న ప్రమాదాన్ని హెచ్చరించింది.

అచంచల చిత్తంలో ఆమె ద్వారంపై వత్తిడి తెచ్చింది.
ప్రతికూల ధ్వనులతో ద్వారం తెరుచుకుంది.
నిరోధ శక్తులన్నీ భయంకర రక్షణనుండి పైదొలగాయి.
ఆమెలోని జీవుడు అంతర్లోకాలలో ప్రవేశించాడు.
ఆ నిశ్చలచైతన్య ద్వారం ఆవల ఒక ఇరుకుబాట
అక్కడ శ్వాస ఆడడమే మహాబాధాకరమైంది.
ఇంద్రియాలలో దాగిన ఆత్మకై అన్వేషించసాగింది.
సూక్ష్మపదార్థం మందంగా సమీకృతమైంది.
ఏదో అంధశక్తి ఒకచోట చేరినట్లయింది.
దారి తప్పించే వెలుగుల వైరుధ్యాలు
కనిపించని దృష్టి మహత్తర నిరోధమైంది.
ఆమె చైతన్యంశరీరాన్ని వదలి ఆత్మలో జారబడ్డది.

అతి జటిలమైన సరిహద్దు రేఖను దాటింది.
అక్కడ జీవుడు అచేతన నిశ్శబ్దంలో మునిగిపోతాడు
లేదా, భౌతికత నుండి మానసిక కల్లోలాన్ని చేరతాడు
ప్రాథమికమైన బలహీనతలతో పోరాటం సాగుతుంది.
అస్పష్టమైన ఆలోచనలు అస్పష్టరూపాల్ని ధరించి
నిర్నిరోధంగా కామప్రకోపం జరుగుతుంది.

మొదట ఆ ఇరుకు బాట అతికష్టంగా తోచింది
అస్థిర శక్తుల, అస్థిర సంకల్పాల తాకిడి ఎక్కువ
అక్కడ అన్నీ వుంటాయి కానీ ఏదీ సవ్యంగా ఉండదు.
ఒక్కొకసారి మార్గం కనిపిస్తుంది కానీ ద్వారం మూతపడుతుంది
ఆమెని గూఢ అంతరంగశూన్యాన్ని దాటి ముందుకు పోయింది
లోలోపల కాలం బాటలలో సంచరించింది
చివరకు ఒక అరూపస్థితిని చేరుకున్నది.
అది పరిమితానికి ఆరంభం, అపరిమిత భావనా ప్రపంచం.
అయినా అంతాగందరగోళమే, ఏదీ ఆత్మకు అందదు.
జీవుని ఆక్రందనలు తప్ప అక్కడ ఆత్మశాంతి కనిపించలేదు.

ఏదో భయంకర వాతావరణం చుట్టుముట్టింది.
అర్థం పర్థం లేని శబ్దాలు హోరెత్తించాయి.
ఏవేవో అరుపులు పిలుపులు ఆక్రందనలు అస్పష్టంగా
అనేకానేక దృశ్యాలు కళ్ళముందు కదలిపోసాగాయి.
ఆ దృశ్యాలకు ఒక క్రమం లేదు వివరణ లేదు.
గుండె బరువెక్కిపోయే ఆలోచనా పరంపర
ప్రతి ఒక్కటి తనవైపు లాగాలనే ప్రయత్నం
కాని దేనికీ లక్ష్యం లేదు అహంకారం తప్ప.
సామాన్యమైన లక్ష్యం లేని ఆలోచనల సముదాయం,
ఒక దానితో ఒకటి పోటీపడి మేధను వేధించసాగాయి.
వివేకాన్ని స్వస్థానం నుండి పెరికివేసి,
దాని అవశేషాల్ని జీవుని ప్రక్క నిరుపయోగంగా వదలింది.

అది ప్రకృతి పంకంలో విస్మరించబడుతుంది.
ఆత్మరక్షణలో అది హతమై విస్మరించబడుతుంది.

అలా జీవశక్తి మానసిక అధికారానికి దూరమవుతుంది.
ప్రకృతి ఆత్మసామ్రాజ్యాన్ని వదలివేస్తుంది.
ప్రాథమికమైన శక్తులు, ప్రాపంచిక సుఖాలు
అనంతంగా ఆనందాన్ని అనుభవించ పూనుకుంటాయి.
అరాచకంలోనే పరమానందం లభిస్తుంది.
ప్రతిఘటనే పిచ్చి ఉన్మాద దాన్ని అందిస్తుంది.
అది ఆత్మప్రమేయం లేని ఇంద్రియ లోలత్వం
ఏ శక్తి లేనట్లు ఆత్మపరోక్షంగా నిద్రిస్తుంది.
కానీ శక్తిపూర్ణమైన దివ్యత్వం లోపల జాగృతమై ఉండి,
పరమాత్మ స్పర్శకు జీవుని సమాయత్తం చేస్తుంది.
కాని మనస్సు అగాధంలో కూరుకుపోయినప్పుడు
ప్రజ్ఞాప్రాభవ వైభవాలకు అవకాశం ఏది ?
మనస్సులేని దేహానికి తేజస్సు ఉపయుక్తం కాదు.
జీవనానందం, ఆధ్యాత్మికానందం కలగవు
అప్పుడంతా అచేతనం, అంధకార బంధురమే
అవ్యక్తం ప్రకృతి ప్రతి పుటలో తన ముద్రవేస్తుంది.
లేకుంటే మనస్సు ఉన్మత్తి చర్యలకు లోనవుతుంది.
ప్రాపంచిక విషయాలకై ప్రాకులాడుతుంది
అనేకానేక వికారాలు, ఉద్రేకాలు ఏర్పడతాయి
అప్పుడు ఆనందం, శాంతి, వెలుగు ఏవీ కనిపించవు.

ఈ భయంకరస్థితిని ఆమె త్రోసివేసింది.
ఉరుకులు, పరుగులు తీసే జనసంకీర్ణ ప్రాంతంలో
అనంతంగా కనిపిస్తున్న అస్థిర పథంలో
ఆమె విశ్రాంతిలేకుండా ప్రతిక్షణం తిరిగింది.
స్థిరసంకల్పం, వివేకం ఆమెకు మార్గదర్శకాలు కాగా
తన సంకల్పంతో భయంకర వత్తిడులు దాటి

పరమాత్మ నామంపైన మనసును నిమగ్నం చేసింది.
అప్పుడు సర్వం నిర్మలమై ప్రశాంతమై, స్వతంత్రమైంది.
అప్పుడే పూర్తి విముక్తి లభించిన ప్రశాంతత ఏర్పడ్డది.
కొంతసేపు ఆ మహాశూన్యంలో పయనించింది.
కనిపించని గోళంనుండి ఒక దివ్యకాంతి ప్రసరించింది.
ఆకృతిలేని ఆనందమేదో అలరించింది.
ఇది అనరాని శూన్యస్థితిలో సచ్చిదానందం లభించింది.
ఇప్పుడు మరో మహత్తర ప్రమాదం ముంచుకొచ్చింది.

శారీరకమైన మానసిక వత్తిడి, లక్ష్యరహితమైన
అజ్ఞాన భావన, సంకల్పం ఆమెను వదలిపోయాయి.
మనస్సు, ఆత్మ అధీనంలో లేని ఉపచేతన
జీవికి ప్రధాన ఆశ్రయంగా చేరువై
అన్ని శక్తులను ఒకే బిందువులో కేంద్రీకరించి,
తన శక్తిని భయంకర సాగరాలంతటి శక్తిగా మార్చివేసింది.
ఆమె అంతరంగం నిశ్చల నిశ్శబ్దంగా మారింది
అక్కడి మహాశూన్యం ధావళ్య సంగీతమే అయింది.

జీవుడు ఉరుకులు. పరుగులతో కల్లోలపరచి
గ్రీష్మసైకతాలపై విరుచుకు పడుతున్నట్లు
ఉప్పెనగాలి తరంగాలై తీరాన్ని తాకింది.
ఆ తరంగాల ఉధృతికి తీరాలు ప్రిదిలిపోయాయి.
ఆ భయంకర శబ్దం అనంతం, అపూర్వం.
అది అలా పయనిస్తూ ఆమె చెవులకు సోకింది.
పరమాత్మ మహాశక్తికి దాసోహం కమ్మని శాసించింది.
ఒక బధిర శక్తి ఏదో మూగగా ప్రోదిపడినట్లు
వేనవేల శబ్దాలు నిశ్శబ్దంలో లయించిపోయాయి.

అదే హృదయానికి అండగానిలిచి ఆనందం ప్రసాదించింది
అదే ఆత్మ అంగీకారానికి ఆమోదానికి ప్రత్యక్ష సాక్షి
ఆమె తటస్థవిధానమే దాని మహాశక్తికి నిదర్శనం

సువిశాలమైన ఆమె దర్శనాత్మస్థితిలోనికి
జీవనానందాన్ని మహోన్నతంగా కొనితెచ్చింది.
ఆ తరంగాలు లోకపుభయాల్ని, ఆశల్ని మోసుకొచ్చాయి
ప్రకృతిలోని, జీవునిలోని అతృప్త ఆరాటాలు అవి
అది అనంత కామనల్ని పూరించలేకపోయింది.
మహాగిరులవంటి ఆత్మరహస్యాలను అందించింది.
అది ఆరని అగ్ని మార్మికత్వాన్ని అందజేసింది.
జీవుని సృష్టిస్పందనలో నిబంధించబడిన
అవ్యక్త తొలి బ్రహ్మానందానుభూతిని అందించింది.
అగోచర అంధకార అధోలోకాల నుండి అక్రమంగా
ఏదో ఆనందం, అద్భుతం పొంగి పొరలింది.
భౌతికమైన వెలుగులోనికి దాని అద్భుతమహిమ
ప్రకృతి సహజమైన అనాగరిక ఆనందం ఉజ్వలించి
నిషిద్ధమైన మార్మిక అగ్నిగా ప్రవహించింది.
అది లోతుతెలియని లైంగికానంద ప్రతీక
లైంగికసుఖాలకు మృత్యువుకు తీయతీయని విషధార
జీవుని సుఖభోగాలకు అది సుమధురస్వప్నం
అదే స్వర్గసుఖమన్న భ్రాంతిలో కాటువేస్తుంది.
వలయాలు వలయాలుగా ఏర్పడేఐహిక సుఖభోగాలు
ప్రపంచంలో లక్ష్యాన్ని తెలుసుకొనకుండా చేసే అద్భుతాలు
తెలిసిన దానికన్న ఎక్కువ, తెలియని దానికన్న తక్కువ
అందులో మనస్సు జీవుడు అనంతంగా వెదుకుతుంటారు
అంతరాంతరంలో ఎన్నటికీ తృప్తి లేని ఆకాంక్ష
అది ఎన్నటికీ తీరదు, ఎన్నటికీ తృప్తి లభించదు.
పరిమిత ప్రపంచంలో జీవితాన్ని విస్తృతం చేస్తుంది.
శూన్యంలో కరిగిపోయే శిఖరాలపైకి ఆరోహణ
అసంభవమైన మహత్తుకోసం చిరాన్వేషణ.
ఎప్పటికీ తెలియనిదాన్ని గురించి కలలు కన్నది.
ఎప్పటికీ జయించరాని దాన్ని పట్టుకొన జూచింది.

అది కేవలం స్మృతులలోకి వెదుకసాగింది.
హృదయం దాటగానే వాటి ఆకర్షణలు హరించాయి
హత్యచేయగలశక్తిని, హింసించగల ఆనందాన్ని
అసంపూర్ణ విషయాల ఊహా రూపాలను
ప్రేమమందిరాలలోని విశృంఖల కాముకత్వం
దివ్యసౌందర్య ధీధితులతో పశువాంఛ కలిసింది.

ప్రతికూల శక్తుల ఆర్భాటాలు. హాహాకారాలు వెంటవచ్చాయి.
ఆ తేజోమండలాలు స్పర్శ అనుభూతిలోని క్షణాలలో
అగ్నికీలలు ఆకాశాన్నంటాలని ప్రయత్నం జరిగింది
స్వప్నసీమలలో నిర్మించుకున్న ఆకాశహర్మ్య లవి
అవి క్రమంగా చీకటిలో, శూన్యంలోకరిగి కలిసిపోతాయి
వాటి అనురాగ మధువులు. ద్వేష కషాయాలు
వెలుగులు, మేఘాలు, ఆనందాలు, కన్నీళ్లు, మారి మారి
భయంకర అఖాతాలలో, అగడ్తలలో కలిసిపోతాయి.

దాని భయాలు, ఆనందాలు, పారవశ్యాలు, పరితాపాలు
అతీంద్రియ ప్రజ్ఞలు, అతి సామాన్య ప్రజ్ఞలు
పార లౌకిక సంబంధాలు, అనుబంధాలు, అనుభవాలు
స్వర్గంపై విశ్వాసం, నరకంతో సంబంధంఅన్నీ నశించిపోతాయి.
భూ భారం వల్ల ఈ శక్తులేవీ విజృంభించలేవు
వాటికి అమృత మాధుర్యాలు, విషపుకోరలు ఉన్నాయి
పర జీవన దృక్పధంలో ఒక మహా తీవ్రత ఉంది
అది నిశీధపు చీకటిలో వినీల స్వర్గాన్ని చూస్తుంది.
వాంఛ రెక్కలు విప్పి దివ్యత్వంవైపు పరుగుదీస్తుంది.

ఉన్నత శిఖరాలనుండి మానసిక ఆలోచనలు వెలువడి,
కనుపాపలలో అద్భుతమైన తేజస్సును ప్రసరించి
అది పవిత్రమైన జ్ఞానజ్యోతిగా భాసిస్తుంది
ఆ జ్యోతి వెలుగులో వారూ పరుగులు తీస్తారు.
ఉద్రేకపు ఒత్తిడులకు మనస్వరాలు అనుకరించి

చరించగా పతనోన్ముఖం కాలేక, దేవతలవలె.
మెరుపుల వేగంతో ఆకాశంవేపు పరుగుదీస్తాయి
అన్ని అనుమానాలు, శంకలు తెగిపోతాయి
ఆ 'అనాసక్తత' దాదాపు దివ్యత్వంగా మారుతుంది.
అక్కడ సంపాదించేజ్ఞానం అంతా స్వతంత్రమైంది కాదు
కనిపించె రూపాలేవీ స్వర్గానికి సంబంధించినవి కావు.
దాని శక్తిమహత్తరంగా కనిపించినా ప్రమాదకరమే
అది విషాన్ని అమృతంతో కలిపి ఆస్వాదించగలదు.
ఉన్నతమైన ఆ వెలుగులపై అసత్యం స్వారీచేస్తుంది.
'సత్యం' అసత్యపు ఆలింగనంలో సుఖిస్తూ ఉంటుంది.
ఒడ్డు లొరసి, ఆ కాంతిజలాలు ప్రవహిస్తూ ఉంటాయి.
మహత్తర అనృతంతో అంచులు మెరుస్తూ ఉంటాయి.
ఇక్కడ జీవితపు అథోలోకాలలో అన్నివైరుధ్యాలు కలుస్తాయి.
'సత్యం' చూస్తూనే దైన్యంగా తన పని నిర్వహిస్తుంది.
అక్కడ ప్రజ్ఞకు అజ్ఞానం బాసటగా నిలుస్తుంది.
అది ఎంత ఉత్సాహంగా పరుగులు తీసినా,
చివరకు ప్రమాదకర మధ్యంతర మండలాన్ని చేరుకుంటుంది.
అక్కడ 'మత్యపు' మృత్యురహిత ఆస్వాదనం భరించి ఉంటుంది
లేదా అవి మెరుపులు చరించే లోయను చేరుకుంటాయి
ఆ మహాకాంతి కిరణానికి బందీలయిపోవడం జరుగుతుంది
ఆ మండలంలో చిక్కుకున్న ఆత్మలకు 'విముక్తి' ఉండదు.

అధికారులవలె కాక, ప్రతినిధులవలె శాశ్వతంగా,
కాలంతో కలిసి, జీవుని వాంఛల్ని తీర్చుతుంటాయి.
వాటి శరీరాలు ఏదో 'శూన్య' గర్భంనుండి జనిస్తాయి
ఆత్మను తాత్కాలిక స్వప్నాలలో వ్యామోహపరచి
అమరమైన ఆత్మను వదలి, అవి నశించిపోతాయి.
భౌతిక గర్భాన్ని వదలి శూన్యంలో లయించిపోతాయి.
కొన్ని పట్టువడక, నశించక తప్పించుకుపోతాయి.
'సత్య' రూపాన్ని తమ హృదయాలలో నిలుపుకుంటాయి.

చేసిన తప్పుల నుండే జ్ఞానాన్ని సంపాదిస్తాయి.
అల్పాత్మ చీకటిగోడల్ని ఛేదించి బాటలు ఏర్పరచుకుంటాయి.
ఆపైన మహాజీవన పథంలో పయనిస్తాయి.

ఈ స్థితి అంతా గతించి, ఆమెకు దృశ్యమానమైంది.
ఒక మహత్తరమైన ప్రశాంత ద్వీపంచుట్టు
అగోచర పర్వతాల నుండి తరంగాలు వచ్చి తాకినట్లు
అవి అలలు అలలుగా సన్నని తీరాలను సోకినట్లు
భయంకరమైన నురుగులు లోహాన్ని క్రమ్మివేశాయి.
అంతలో వేయికాళ్ళ రక్కసి పరుగు పరుగున వచ్చింది.
అది భయంకరంగా నురుగలు క్రక్కుతూ వచ్చింది.
అది చీకటి అర్ధాన్ని ఆకాశంలోకి పరుగుదీయించింది.
దాని కఠోర స్వరం దిగంతాలలో కలసిపోయింది.

ఆ పర్వాల నిర్మలత్వం ప్రశాంతత అలముకుంది.
వినీలాకాశం, పచ్చని నేల, అందాల్ని పంచుకున్నాయి.
అవి ఆనందంలో చిరకాల మిత్రులవుతాయి
విశ్వహృదయం జీవనానందం నింపుకుంటుంది
ఇప్పుడంతా నిశ్చలం, నేల నాలుగు చెరగులా ప్రశాంతత,
ఆ ప్రశాంతత ఆమెది కాదు. కల్లోలం ఆమెది కాదు,
అంతరాంతరంలోని విపుల నిశ్శబ్దం ఆమెది
జీవన స్పందన నశించి, ఆమె స్వతంత్రమై నిశ్చలమైంది.

ఆత్మగతమైన సుప్రశాంతిలో ముందుకు పయనించి
ఒక మహత్తర తేజోమండలాన్ని చేరుకుంది.
అక్కడ జీవుడు మహాశాంతిని పొందుతున్నాడు.
తిరగబడే ఆమె హృదయం స్థిమిత పడ్డది.
క్రమ పురోగమనానికి అలవాటు పడడం వల్ల
మొదటి ఆత్రుత, తొందరపాటు లేకుండాపోయాయి
స్వాతిశయం, అహంకారం వదలివేసింది
తన రాచరికపు ఆభిజాత్యం సైతం వదలివేసింది.

తనకున్న సంపదలు, వైభవాలు నిరుపయోగాలు
ఆమెలోని ఆవేశ కావేషాలన్నీ అణగిపోయాయి.
వాంఛాలాలసత్వం ఉద్రేకరహితమైంది.
పంతాలు, పట్టుదలలు పూర్తిగా సమసిపోయాయి
ఇంద్రియాల తిరుగుబాటు చప్పగా చల్లారిపోయింది
జీవునికి తన పరిధులేవో స్పష్టంగా గోచరించాయి.
ఇప్పుడు స్వేచ్ఛలేని రాజరికపు ఔద్ధత్యం ఆమెది
సింహాసనం పైనున్న ప్రభువు మంత్రులమాట పాటిస్తాడు
మేధ, వివేకం సేవకులై దేహికి సేవచేస్తాయి
కఠోరనియమాలే దానికి రక్షణగా నిలుస్తాయి
వివేక వర్తనమే శాంతిసుఖాల నందిస్తుంది.

ఆమె సంకల్పం న్యాయనికి కట్టుబడి కొనసాగింది
ఆమె ఉద్రేకం సంకెలల బిగించినట్లు నిస్తబ్దమైంది
ఆమె ఆలోచనలన్నీ కోటలో బందీలైనాయి.
ఆమె తనకుగా ఏదీ కావాలని వాంఛించడం లేదు
వాస్తవం, వివేకం ఆమెకు భూషలై ప్రకాశించాయి.
కఠోరసత్యాలు మాత్రమే ఆమెకు కనిపిస్తున్నాయి.
అవే ఆమె ఆత్మను సింహాసనంపైకి ఎక్కించాయి
రాజ్యం అన్న నియమబద్ధమైన ఒక చిన్న ప్రపంచం.
యుగయుగాల ప్రజ్ఞ విజ్ఞానరేఖలుగా మారి,
అనుకరణకు అనుకూలమైన గ్రంథంగా మారింది
ఆ విజ్ఞానంలో 'ఆత్మ'కు స్వాతంత్రం లేదు.

విద్యార్థి మేధ జీవితంలో ఎక్కువభాగం ఆక్రమిస్తోంది.
అది ఇరుకు గదుల్లో నిర్వ్యాపారంగా ఉంటుంది.
భయంకర విశాల విశ్వానికి దూరంగానే ఉంటుంది
కారణం, అనంతంలో 'ఆత్మ' విలీనం అవుతుందన్న భయం
విశృంఖల భావ తరంగాలు ఒక నియతికి లోబడి
ఆలోచనలనే స్తంభాలకు కట్టుబడిపోతాయి,
లేదా భౌతికత అనే సుస్థిత పునాదికి కట్టుబడతాయి.

లేనప్పుడు ఆత్మ తన ఔన్నత్యాలపై ఉండిపోతుంది
ఆదర్శం అనే పరమధర్మానికి విధేయంగా ఉండి
నిలకడలేని గాలిలో ఆలోచనా సింహాసనం అధిష్టించి
భౌతికమైన అస్థిరత్వాన్ని తిరస్కరిస్తుంది.
ఈ వాస్తవాన్ని వదలి తన కలల్లోనే ఉండిపోతుంది.
అన్నీ ఒక నియత లోకంలో ప్రవేశిస్తాయి.

జీవుని లోకం ఒక నియమబద్ధ ప్రపంచం
దాని ఆలోచనలు సుశిక్షితులైన సైనికుల వంటివి
అవి నిర్ణీతస్థావరాలలో నియమంగా చరిస్తాయి.
అవి మానసిక క్రమశిక్షణకు లోబడి వుంటాయి.
ప్రతి ఒక్కటి నక్షత్రం వలె తన స్థానంలో ఉంటుంది.
అవి తారాపథంలో నియమంగా సంచరిస్తాయి.
తమ తమ ఆధిపత్యాలను నెరవేర్చుతుంటాయి.
రోదసిలో, వాటివాటి స్థానాలు చెక్కుచెదరవు.
కులీన వంశంలో జన్మించిన నయన తారవలె
రాచవీధులలో మేలి ముసుగులేకుండా సంచరించవు

ఆమె కేవలం అంతఃపురాలలోనే నడయాడుతుంది.
ఆమె ఆలోచనలు సుందరవనాలకే పరిమితాలు.
జీవితం సురక్షిత మార్గాలకే పరిమితం
అది క్లిష్టమైన శిఖరాలజోలికి పోదు
మరో ఒంటరి నక్షత్రంతో చెలిమి నాశించదు.
పతనమై లయించిపోయే ప్రమాదం తెచ్చుకోదు
లేదా, ఉప్పొంగిపోయి విచ్ఛిత్తిని ఆశించదు
ఏ సాహసానికి పూనుకోదు, ప్రమాదాన్నికొనితెచ్చుకోదు.
తన మందిరంలోకి మరొక దేవతను ఆహ్వానించదు.
ప్రపంచపు సరిహద్దుల్ని దాటి అపరిమితంగా
హృదయం వాంఛించే దివ్యరూపాన్ని చేరుకోదు.
అంతర్జ్వాలలలో లోకాన్ని భస్మీభూతం చేయదు.

జీవితం సజావుగా, సాఫీగా జరిగిపోవలసించే
అవకాశం ఉన్నంతలోనే ఔన్నత్యం అనుభవిస్తుంది.
అంతేకాని ఆలోచనా మందిరాన్ని వదలిపోదు
అది విశాల ఔన్నత్యాలను దురాక్రమణ చేయదు.
ఒకవేళ అది ఆదర్శపు టాకాశంలోకి ఎగిరినా
ఆలోచనా గగన సీమల నీలిమలో లీనమైపోదు
అది గగనాలలో సుశిక్షిత సౌందర్యంతో,
వెలుగులతో భాసించే సుందర కుసుమాన్ని చిత్రిస్తుంది.
సమదర్శన దృష్టితో ఆత్మ జీవనాన్ని రక్షిస్తుంది
దాని చర్యలన్నీ యదార్థభావనా విలసనాలే.
ఆగ్రహించడం లోకాన్ని ఖండించడం జరగదు
లేక, వివేకపూర్ణంగా ముందుకు వేసే ప్రతి అడుగు
తనను లక్ష్యానికి చేర్చగలిగేదై ఉంటుంది.
లేదా, ఆసమున్నతస్థితిలో ఏదో నిశ్చల సంకల్పం
అంతర్యంలో ఒక దివ్యశాసనాన్ని ఆమోదించినట్లు
క్షుద్రశక్తుల రహస్యసంపదలన్నీ జయిస్తాడు
అజ్ఞాతంగానే మహాసామ్రాజ్యాన్ని జయిస్తాడు.
ఆ మహత్కార్యంలో లవలేశం స్వార్థం ఉండదు
అది జీవుని మానసిక వికారాలకు సూచిక మాత్రమే
అది ఆత్మ చైతన్యపు సంస్పందన, పరమాత్మతో
జీవాత్మ అనుబంధం కావడానికి ఒక గురుతు.
లేదా, పరబ్రహ్మ పథంలో పరిపూర్ణ ప్రవర్తనం
లేక, ఒక మహదాశయానికి ఆశయసిద్ధికి
అనుకూలమైన శరీరాన్ని నిర్మించుకోవడం
భావన, క్రియ ఏకమై చిరు ఆదర్శాలతో
ఘనమైన కుడ్యాన్ని ఆత్మచుట్టూ ఏర్పరచడం
ఎంత ఇరుకుప్రదేశంలోనైనా ధ్యానం కుదురుతుంది.
ఏ ధ్యానం అయినా, మన ఆరాధనామూర్తికే చెందుతుంది.
లోకం చూడరాదని తలుపులు బిగించి ధ్యానించినా.

ఆ మందిరంలో చేసే తపస్సు విశ్వవ్యాప్తమవుతుంది.
రూపరహితమైన, నిర్వికారం ముందు మోకరిల్లినా,
మనస్సు ప్రేమాగ్నిని అలజడిని లెక్కించదు.
ఎంత వివేకవంతమైనా మతం మనస్సును నిర్జీవం చేస్తుంది.
జీవితాన్ని నీతి నియమాలతో కఠోరం చేస్తుంది.
చివరకు త్యాగం వాడి. వేడిలేనట్లు మారుతుంది.
పవిత్ర గ్రంథం వ్యాసపీఠంపైనే మిగిలిపోతుంది
పట్టుదారాలవంటి భాష్యాల ముడి విడివడదు
అధ్యాత్మిక రహస్యాలు ఎన్నటికీ అంతుబట్టవు.

మనస్సు నిశ్చలమైనప్పుడు ఏర్పడేది ప్రశాంతస్థితి
అక్కడ జీవితం జీవితం కాదు, ఉద్రేకాలు ఉండవు
ఇంద్రియాస్ఫాటాలన్నీ నిశ్శబ్దంలో క్రుంకిపోతాయి.
అక్కడ ఆత్మలేదు, ఆత్మశక్తిలేదు, ఉన్నదొక్కటే మేధ
మనస్సే ఆత్మగా, ఆత్మశక్తిగా మారుతూ ఉంటుంది
ఆత్మశక్తికూడా ఒక మానసిక శక్తే అవుతుంది
అది భావనా వైశిష్ట్యంలో లీనమైపోతుంది
అది సూర్యకాంతిని కన్పించకుండా చేసే వెలుగు.
అటువంటి సుస్థిర, అచలస్థితికి ఆమె చేరుకున్నది.

అక్కడ అంతా నిశ్చలం అన్నీ సముచిత స్థానాలలో ఉన్నాయి
ప్రతిదానికీ తన గమ్యం తెలుసు, లక్ష్యం తెలుసు
చివరకు అన్నీ చేరుకోవలసిన సుస్థిరత్వం అదే.
అక్కడ ప్రతిఒక్కరు సాధికారికంగా నిలబడి
రాజదండంతో అనుశాసించగల స్థితిలోనే ఉన్నారు
ప్రతిమాటలో, చూపులో అధికార దర్పం.
వారి ప్రతివాక్యం ఒక దివ్యశాసనం అవుతుంది.
మహోన్నత భావనాబలంతో పునీతమై
దివ్య వర్చస్సులను వెలార్చే అంతర్లోకాలను
చేరుకోగలిగిన బాటసారీ, నీవు ధన్యవు !
ఓ సముజ్వల జీవన పథగామీ ! అన్వేషీ !

ఇదే నీ గమ్యం ! అన్వేషణ చాలించి శాంతించు.
సృష్టిలో సుస్థిరతకు ఆవాసమైన నెలవు మాది.
ఇదే సత్యం, ఇదే పరమాత్మ అసురాగ నిలయం
మహాత్ముల పట్టికలో నీ పేరు నమోదు చేసుకో,
అందరి ఆమోదంతో నీకిక్కడ ప్రవేశం లభిస్తుంది.
వివేకమే ప్రస్థానంగా నీ మనస్సును ఆశ్రయించు
ఆ జీవన్ముక్తుల శ్రేణిలో నీవూ ఉన్నావు.
మాలో ఒక్కరివైన నీ అదృష్టాన్ని గుర్తించుకో.
సూక్ష్మరూపంలో నిక్షిప్తమైన సర్వాన్ని మనస్సు గ్రహిస్తుంది
పరమాత్మ జీవునకు అనుగ్రహించేవన్నీ ప్రమాణికాబద్ధమే.
అదే అన్నింటికీ అంతం, ఆపైన మరేదీ మిగలదు.
అదే సురక్షితమైన కట్టకడపటి సరిహద్దు
అదే వెలుగు కరవాశం వంటి వినిర్మలత్వం
అదే ఏకైక సత్యంగా భాసించే విజయదీప్తి
అకళంక బ్రహ్మానందం మణికాంతివలె ప్రవహిస్తుంది.
ఇక్కడ స్వర్గం, ప్రకృతి కలసిపోయి జీవిస్తాయి."
నిశ్చలంగా, నర్మగర్భంగా, మహర్షి చెప్పిన మాటలు
సావిత్రి అంతర్దృష్టితో చూచి అర్థం చేసుకున్నది
అంతర్వాణి ప్రశ్నలకు ఆమె హృదయమే సమాధానం,
ఇక్కడ హృదయం సమాధానం చెప్పలేదు; వివేకమే
సమగ్రంగా, సంక్షిప్తంగా, నిర్మలకాంతిగా ప్రభవించింది.

"ఈ అయోమయ అరాచక ప్రపంచంలో,
కాలానుకూలంగా వస్తూ, పోతూ శాశ్వత ధర్మాన్ని
ఏకైక సత్యాన్ని గ్రహించగలవారు సుఖిస్తారు.
వారు భయభ్రాంతులు, వ్యామోహాలు లేకుండా జీవిస్తారు.
ఈ అస్థిర, అయోమయ ప్రపంచంలో ఒక
స్థిర విశ్వాసంతో జీవించేవారు ధన్యులు
లేక, తమ ఆధ్యాత్మిక హృదయక్షేత్రంలో
ఒక పవిత్ర బీజాన్ని నాటుకున్న వారూ ధన్యులే

అచంచల విశ్వాసంతో నున్నవారు సుఖజీవులు.
అంతమైన ఈ అన్వేషణను ఇంతటితో ముగించి
శాశ్వతము, సుస్థిరము అయిన సత్యాన్ని తెలుసుకోవాలి,
ఈ విశ్వరచనాప్రక్రియ రహస్యం తెలుసుకోవాలి.
దృశ్య ప్రపంచపు విజ్ఞానక్రమాన్ని అవగతం చేసుకోవాలి.
ఇక్కడనే నిలిచిపోకూడదు, నా ఆత్మను తెలుసుకోవాలి''

అందరూ సంతుష్టులైన ఆ తేజో లోకంలో
ఎవరూ ఆమెకు సమాధానం చెప్పలేదు
వారికి అలవాటైన పద్ధతితో వెళ్లిపోసాగారు.
ఆ వాతావరణంలో ప్రశ్నవిని ఆశ్చర్యపోయారు
ఇంకా పరాన్ని గురించిన ఆలోచనలకు అబ్బురం.
తేజోగోళాలనుండి వచ్చిపోయేవారు, వినిపించీ
వినిపించనట్లు ఆమె భావాలకు అర్థాలు వెదుక్కున్నారు.

“ఆత్మ అన్నది రక్త, మాంస నిర్మితం కాదనీ,
అది ఆలోచించే మేథకు సైతం అందనిదనీ
అది మానస వ్యాపారాన్ని సైతం కలచివేయగలదనీ.
అది ప్రకృతి భౌతిక మందిరంలో కొలువుండ ఆశిస్తుందనీ
మనిషి ఆలోచనాగహ్వరంలో కలల్ని కలిగిస్తుందనీ
మనిషిలో క్షణికమైన సుఖలాలస రగిలిస్తుందనీ
మృత్యుసాగరంలో, అది జీవిని వెన్నంటి ఉంటుందనీ
తెలియని ఈ ప్రాణి ఎవరని ఆశ్చర్యపోయారు.

మరికొందరు, “ఆమె తన ఆత్మనే అన్వేషిస్తున్నదని”
పరమాత్మపేరున మహత్తరఛాయను వెదుకుతున్నదనీ
అది ఆదర్శలోకంలోని అరూప సంపద అనీ.
ఆత్మశక్తి మనస్సు కల్పించే విభ్రమమని, దాని
రూపం, ఉనికి, పరిమితి ఎవరికీ తెలియనివని
ప్రతిజీవి, ఆ దేవదేవుని రూపమైన కుమారుడేనని
ఆత్మ తల్లిదండ్రులలో మనస్సు ఒకరు, ఆ చైతన్య

హేతువు పైన, దివ్య తేజస్స్ప్రతి, చరిస్తుందని,
కనుపించే జగత్తును కల్పించింది మనస్సేనని,
ఇక్కడ ఉన్నదంతా, మన ఆత్మలోని ఒక భాగమేనని
మనం నివశిస్తున్న ఈ ప్రపంచాన్ని సృష్టించింది
మన మనస్సులే"నని. కొందరనుకున్నారు.

కొందరు అసంతుష్టితో, మార్మిక దృక్పథంతో
తమ విశ్వాసాన్ని తామే చంపి బాధపడుతున్నట్లు
"ఇంకా పరమాత్మను కోరే జీవి ఒకటి ఉన్నదా ?
ఆ మార్గం కనిపించి, ద్వారం తెరుచుకుంటుందా" అనుకున్నారు.

ఆమె తన నిశ్శబ్ద అంతర్యంలోకి చొచ్చుకుపోయింది
జన సందోహంతో కిటకిటలాడుతున్న రహదారి చేరింది.
వారిలో తేజోమూర్తులు, సంకల్పసిద్ధులు, సాధ్యులు ఉన్నారు.
వారీలోకపు మార్మిక కుడ్యం చేరాలని యత్నిస్తున్నారు.

రహస్యద్వారాలు దాటి బాహ్యమేధలో ప్రవేశించాలని యత్నం
అక్కడ వెలుగు కనిపించదు, మార్మికస్వరాలు వినిపించవు.
మనలో నిగూఢంగా నిక్షిప్తమైవున్న ఔన్నత్యానికి ప్రతినిధులు
గుహ్యంగావున్న ఆత్మమందిరంలో వారే అతిధులు.
వారొకవిధమైన ఆధ్యాత్మిక మగతలోకి చేరుకుంటారు.
లేదా జాగ్రదవస్థలో కొన్ని అద్భుతాల్ని ప్రదర్శిస్తారు.
వారు చూపే వెలుగులో కొన్ని భావాలు మనల్ని వెన్నాడుతాయి.
ఆ స్వప్నాలు కనిపించని వాస్తవాలకు సూచికలు.

మాంత్రిక నేత్రాలుగల దేవతలెందరో కన్పిస్తారు
సుందరమూర్తులైన దేవుళ్లు ఏవేవో ఆశలు సృష్టిస్తారు.
ఏవేవో మధుర స్వప్నాలు బంగారు లోకాలు చూపిస్తారు.
మన ఆశయాలే బంగారు కలలై, స్వర్గాలు చూపిస్తాయి.
మన భావనలే హృదయానికి దివ్యానుభూతులు కలిగిస్తాయి.

సావిత్రి ఆ దివ్య తేజోమూర్తులమధ్య సంచరిస్తూ
వారిలో కనిపించే ఆధ్యాత్మిక తేజస్సును ఆశించింది.

వారివలె భగవంతుని లోకాన్ని చేరాలని ఉవ్విళ్లూరింది
కాని ఆమె హృదయం తన ఉన్నత లక్ష్యాన్ని వదులుకోలేదు
తను ముందుగా తన ఆత్మను గుర్తించాలని తెలుసుకుంది.
తమని తాము ఉద్ధరించుకున్నవారే ఇతరుల్ని ఉద్ధరించగలరు.

ఒక విధంగా ఆమె జటిలమైన జీవితసత్యాన్నే ఎదుర్కొన్నది
బాధిత జనతకోసం వెలుగుల్ని వెంటతెచ్చేవారు,
త్వరత్వరగా బాహ్య ప్రపంచంలోకి పరుగెడతారు.
ఆమె దృష్టి శాశ్వతమైన 'ఆది'ని అన్వేషిస్తున్నది.
ఆమె దివ్య జీవుల నుద్దేశించి చేతులెత్తి పిలిచింది.

"ఆనంద స్వరూపులైన ఓ దివ్య తేజోమూర్తులారా !
నేను వెదుకుతున్న మార్గం, మీకు తెలిస్తే చెప్పండి.
మీరూ అదే బాటలో పయనించి ఉంటారని నా విశ్వాసం.
గుప్తమైన మహా తేజస్సుకు మూలం ఏదో చెప్పండి
గుహ్యమైన నా ఆత్మకు ఆవాసం ఏదో చెప్పండి."

అంతరంగంలో ఎక్కడో ఏ మూలనో కనిపించని
యోగనిద్ర వంటి ఒక మహాప్రశాంతస్థితి పైపు
శూన్యంలోకి, శూన్యంగా, ఒకరు దారిచూపించారు —

"సావిత్రీ, గుహ్యమైన నీఆత్మనుండే మేము ప్రభవించాము.
మానవులను అంధకారంనుండి, అజ్ఞాన తిమిరం నుండి
రక్షించి. వారిలో మహదారాధన, సౌందర్యం కలిగించి,
దివ్యత్వాన్ని అందించే దేవతలం, దూతలం మేము.
పాపంప్రసక్తిల్లినప్పుడు 'పుణ్యజ్యోతి'ని వెలిగిస్తాము.
అజ్ఞానపు వీథులలో జ్ఞాన దీపికల్ని చూపిస్తాము.
వెలుగును కాంక్షించే మా నవసంకల్పం నీ సంకల్పం అదే :

ఓ ప్రచ్ఛన్న దేవతామూర్తీ ! మానవరూపిణీ !
నీవు గుప్తంగా దాచిన మూర్తిని ఎవరు ఆకాంక్షిస్తారు?
నీకు తెలియని 'సత్యస్వరూపం' ఎవరికీ తెలియదు.
ఈ సుదీర్ఘమైన మార్గంలో ఎవరూ శ్రమపడి పయనించరు.

ప్రశాంతంగా కొందరు మాత్రం గమ్యాన్ని చేరుకోగలరు
మూలత్రికోణ పీఠికపై రగిలే 'అగ్నిని' చూడు తల్లీ,
అదే గుహ్యంగా వున్న నీ ఆత్మకు ఆవాసమైన గహ్వరం"

అప్పుడు సావిత్రి సువిశాలమైన చుట్టు మార్గం వెంట
బయలుదేరి సన్నని ఇరుకుబాటను చేరుకుంది.

అక్కడ పూర్వయాత్రీకుల అడుగుజాడలు స్వల్పంగా కనిపించాయి.
తెలియని లోతులనుండి కొన్ని దివ్యరూపాలు వెలుపడ్డాయి.
అవి తమ దివ్యనేత్రాలతో ఆమెను నిశ్శబ్దంగా పలకరించాయి.
అక్కడి ప్రశాంతతను భంగపరచే శబ్దాలులేవు,
అక్కడ అందరకు ఆత్మ సాన్నిహిత్యమే అనుభవం.

# శక్తిత్రయం

సావిత్రి తన మనస్సును ఏకాగ్రంచేసి అంతరంగం లోపలకు పయనించింది. దాదాపు తన ఆత్మ రహస్యం తెలిసినట్లై అయింది. మూడు విధాలైన ఆత్మశక్తులు ఆమెకు ఎదురైనాయి. ప్రతిశక్తి ఒక స్త్రీ రూపంలో సాక్షాత్కరించింది. మొదట—విషాదం మూర్తీభవించిన దైన్యమూర్తి. రెండవది — శక్తిస్వరూపిణి. మూడవది — తేజోస్వరూపిణి. వారు ఆనందమయి. శాంతిప్రియులు. ప్రతిఒక్కరు సావిత్రి ఆత్మస్వరూపం తానేనన్నారు. అది నిజమే. అయినా సావిత్రి తన సారూప్యాన్ని ఆమోదించలేదు-తనఆత్మను తను తెలుసుకొని తీరాలి.

మొదట ప్రత్యక్షమైనది దైన్యమూర్తి. మూర్తీభవించిన విషాదం. కట్టుపుట్టాలలో దారిద్ర్యం. కూర్చున్న పీఠం కఠిన పాషాణం— లోకంలోని విషాదంఅంతా తానే అనిపించింది, మనిషి జన్మించినదాది మరణించేవరకు అనుభవించే బాధలకు, కష్టాలకు కన్నీళ్ళకు ఆమే ప్రతీక—బాధలుపడే మానవుని స్వరం వినిపించింది. సావిత్రి లోకంలోని క్రౌర్యాన్ని, విషాదాన్ని శాశ్వతంగా తుడిచివేయగల శక్తిని తాను పొంది వస్తానని, లోకం కన్నీరు తుడిచివేస్తానని మాట యిచ్చి ముందుకుసాగింది.

ఆ తర్వాత సావిత్రికి ఎదురైనది ఒక సువర్ణమూర్తి. చేతిలో త్రిశూలం, ఆమె సింహవాహన. ఆమె అపూర్వ శక్తి స్వరూపిణి, ఆమె సైతం తానే

సావిత్రి ఆత్మనని చెప్పింది. తానేదుర్గ, తానేలక్ష్మి-అన్నది. మనిషి సర్వశక్తులు పొంది అసురుడవుతున్నాడు– ప్రకృతిని జయించాడు. ఒకనాటికి దేవతల్ని జయిస్తాడు– కాని మనిషిలో భయం పోవడంలేదు– ఆ భయాన్ని రద్దుచేయ గలశక్తిని తాను సంపాదించుకు వస్తానని సావిత్రి హామీ యిచ్చింది.

ఆ తర్వాత ఆనందానికి, శాంతికి ప్రతినిధి అయిన తేజోమూర్తిని దర్శించింది. ఆమె రత్నఖచిత సింహాసనంపై నిలబడి వున్నది- ఆమె వదనంపై రవితేజం. పెదవులపై స్వచ్ఛంద ధవళహాసం-తాను సావిత్రి ఆత్మనే అన్నది-ఆమె మనిషికి కలలు,ఆదర్శాలు,స్వేచ్ఛ,సౌందర్యం, మంచితనం ఇలా సుగుణాలన్నీ ప్రసాదిస్తుంది–అజ్ఞానంనుండి మనిషి జ్ఞానం సంపాదించి దేవతలస్థాయికి ఎదగడానికి సహకరిస్తుంది–దాని వెనుకనే మనిషి మనస్సు ఉన్నది. మనిషి వివేకం ఉన్నది. మనిషి ఆలోచన వల్ల వైజ్ఞానికుడు కావచ్చు, తాత్వికుడు కావచ్చు– మనిషి తన పరిశోధనలతో, శాస్త్రీయవిజ్ఞానంతో వినాశనం తెచ్చుకోవచ్చు, సుఖించనూవచ్చు. సృష్టిలోని పదార్థాలన్నీ పరిశీలించి. పరిశోధించి,పదార్థవిజ్ఞానాన్ని సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించుకుంటాడు, అయినా సృష్టిరహస్యం అర్థంకాదు. సృష్టికారణం తెలియదు. అలాగే మనిషి జన్మరహస్యం అర్థంకాదు, జీవిత పరమావధి ఏమిటోతెలీదు. మనస్సుతో రాజీ పడలేడు.

పరమాత్మను తనలో నిలుపుకున్నప్పుడే మనిషికి నిజమైన తృప్తి, మానవత్వపు రుగ్మతలకు సరైన చికిత్స–మరల సావిత్రి-పరమాత్మనుండి 'విముక్తి'కి అవసరమైన శక్తితో తాను తిరిగివస్తానని హామీ యిచ్చింది.

మళ్ళీ ముందుకుసాగింది సావిత్రి–

నిరామయ, నిర్వికల్ప, నిశ్చేతన స్థితిలో
ఆరోహణ సంకల్పం తొలి మలుపు తిరిగింది.
సుదీర్ఘ యామినీకుంతలాలు, చంద్రదీప్తి వదనంతో
దుకూలధారిణియైన ఒక దేవత ఆశీనురాలైంది.
ఆమె ఆసనం కఠిన శిలాసదృశమైననేల
ఆమె పాదపీఠి పదును తేలిన గండశిల

ప్రపంచ శిఖరాలపై గూడుగట్టిన దైన్యం
సర్వజీవుల విషాదం ఆమె ఆత్మను కదిలించినట్లు
ఆమెలోతుగా, బాహ్యవస్తువులతో నిండిన
అస్థిర ప్రపంచాన్ని అంతర్దృష్టితో వీక్షించింది.

ఈ లోకమే మాయ, కనిపించేవన్నీ అశాశ్వతం
ఈ అస్థిర సృష్టి మహాశూన్యంలోకి వ్యాపించింది
భూమి కష్టాలు. గ్రహాల చలనాలు, గతులు
జీవుని జన్మయాతన,భయంకర మృతి చూచింది.
ఈ విషాద విశ్వాన్ని తన శరీరంగా ఆమోదించి
సప్తవ్యసనాలను తన గుండెలో దాచుకుని
ఏడు గాయాలతో గుండె తూట్లుపడి రక్తం స్రవించగా
విషాదమే సుందరంగా ఆమె వదనంపై దోబూచులాడింది.

యుగయుగాలకన్నీటిధారలతో ఆమెకళ్ళు అస్పష్టమయినాయి
విశ్వవిషాదంతో ఆమెహృదయం బరువెక్కిపోయింది
విచార యాతనలతో కాలం బరువెక్కి పోయింది
ఆమె గొంతుకలో విషాదసంగీతం పారాడింది.
అయినా ఆమె అచంచల అనురాగం నింపుకొన్నది.
ఆశారేఖతో బరువు కనురెప్ప లెత్తి
మృదు మధుర వాక్కులను మందంగా పలికింది.

"సావిత్రీ! రహస్యమైన నీ ఆత్మను నేను—
ఈ విశ్వ విషాదాన్ని పంచుకొనడానికై వచ్చాను
నాబిడ్డల కష్టాన్ని నా గుండెలోకి తీసుకుంటాను
తారకల క్రిందనున్న లోకానికి ఊరట కలిగించేది నేను
దేవతల కారణంగా నిర్దాక్షిణ్యంగా బాధలుపడి
నైరాశ్యంలో క్రుంగిపోయేవారి ఆత్మను నేను-

నేను అబలను, సేవికను, బానిసను, దెబ్బలుతినే పశువును
నన్ను క్రూరంగా హింసించిన వారిని ప్రేమతో లాలిస్తాను
నన్ను గర్హించి, ద్వేషించే వారిని సైతం ప్రేమిస్తాను

అందరు వాంఛించే సుందరిని, అందాల బొమ్మను
భుక్తిని, తుష్టిని కలిగించేది నేను
దేవాలయంలో పూజలందుకునే దేవతను నేను
బాధల్లో, ఆక్రందనల్లో, అంతటా నేను ఉంటాను.

ఇహంనుండి పరానికి చేర్చగల మంత్రం నేను.
జీవుల ఆవేదనల్లో నేను సంచరిస్తుంటాను.
బాధామయ జగత్తుకు మూలకారణం నేను
శారీరక, మానసిక, దుర్భర వేదనలు రోదనలు
పరలోకం వినిపించుకోదు, అవి తిరిగి తిరిగి
నా గుండెను తాకి, నా ఆత్మను బాధిస్తాయి.

తన గుడిసెలో దగ్ధమయ్యే బక్కరైతును చూచాను
నిర్దాక్షిణ్యంగా హత్య కావించబడే పసిబిడ్డను చూచాను
యమకింకరుల వంటి జనం, వివస్త్రనుచేసి
మానభంగంచేస్తున్న అతివ ఆర్తనాదాన్ని విన్నాను
చూచాను, అవును వారిని రక్షించే శక్తిలేదు నాకు
వారిని శిక్షించడానికి, రక్షించడానికి, ఆయుధం లేదు
భగవంతుడు నాకు ప్రేమనిచ్చాడుకానీ, శక్తిని నాకివ్వలేదు.

చెర్నాకోలు దెబ్బలకు గురై ఉత్సాహం పుంజుకొని
కాడి ఖజానమోసే పశువుల కష్టాన్ని పంచుకున్నాను.
అహరహం భయంతో బ్రతికే పశుపక్ష్యాదులు
నిరంతరం భుక్తికై అవి పడేపాట్లు చూచాను.
అవి ఆకలితో అలమటించి పోతూ అర్థంతరంగా
మృత్యువు నోటికి చిక్కడం బాధతో గమనించాను.

సామాన్య మానవుని జీవన పోరాటంలో భాగం పొందాను
వారి అల్ప సంతోషాలు, చిరుదుఃఖాలు చూచాను
వారు బాధలతో సతమతమై, కష్టాలతో కనలిపోయి
తమ కష్టాలకు ఏమాత్రం విముక్తి లభించదని,

ఆమె నిష్క్రమించింది, ఆమె దైన్య ఆవేదనకు
సమాధానంగా క్రిందనుండి ప్రతిధ్వనించింది.
అది భయంకర వికటాట్టహాసం, ఆక్రోశం,
ఆగ్రహించిన అడవిమృగం గాండ్రించినట్లు
మనిషి లోలోతుల పశుత్వం నోరువిప్పినట్లు
ఒకనాటి దేవుడే, రాక్షసుడుగా మారాడు.
"నేనే విషాదమూర్తినైన మానవుణ్ణి, ఈ విశ్వ
శిలువపైని బంధించబడిన వాణ్ణి నేనే.
నా విషాదంతో వినోదించడానికై దేవుడు లోకాన్ని సృష్టించాడు.
నా అనురాగమే జగన్నాటకానికి కథావస్తువు
ఈ విషాదమయ ప్రపంచంలోకి నన్ను నగ్నంగా పంపి
బాధలు, వేదనలతో నన్ను హింసించసాగాడు.
నేను ఏడ్చి యేడ్చి ఆయన పాదాలపై బడి,
నా రక్తంతో, కన్నీటితో తనను అర్థించాలని ఆశ.
రాబందు నోటకరచుకున్న బలవంతుణ్ణి నేను
ఆహితాగ్నుల్ని ఆవిష్కరించిన మనిషి, తానే
ఆ అగ్నిలో శలభంవలె కాలిపోతున్నాడు.
లక్ష్యాన్ని చేరలేని చిరాన్వేషిని నేను.
ఎన్నటికీ విజయం పొందలేని సేనానిని నేను,
ఎంత పరుగులిడినా గమ్యాన్ని మాత్రం చేరలేను,
నా ఆలోచనాధారలతోనే నరకం నన్ను హింసిస్తుంది
నా సుందర స్వప్నాలతో స్వర్గం నన్ను హింసిస్తుంది
ఈ మానవాత్మ వలన నాకేం ప్రయోజనం ?
పశువువలె శ్రమించి, పశువువలె మరణిస్తాను
నేను తిరుగుబాటు చేసినా, కడకు నిస్సహాయుణ్ణే.
విధి, సాటిమానవులు నన్ను మోసంచేస్తారు
రక్తంవోడ్చి బానిసత్వంనుండి విముక్తి పొందుతాను
శత్రుపాదాలను నా బుజాలనుండి తొలగించుకుంటాను
కొత్త నియంతలు మరలా నాతలకెక్కుతుంటారు.

గురువులు నాకు జ్ఞానసత్వాన్నే బోధించారు
విషాదపూర్ణమైన విధిరాసిన ఒప్పందంపైన
భగవంతుని ముద్రలో నా హస్తాక్షరాలు కనిపిస్తాయి.
నేను ప్రేమిస్తాను, పుట్టినదాది ఎవరూ నన్ను ప్రేమించలేదు
నా కృషిఫలితాన్ని ఎవరో కైవసం చేసుకుంటున్నారు.
నాకు మిగిలేవి నాలోని దుష్ట భావనలే.
భగవంతునితో, మనిషితో నిత్యం నాకు పోరాటమే.

సంపదల్ని ద్వేషించడం నాకు యిష్టంలేదు
సుఖాలను కాలదన్నుకోవటం నాకు యిష్టంకాదు.
నా ప్రకృతి, కృతి ఏవీ మార్పు చెందవు.
నేను నాకోసమే ప్రేమిస్తాను, నన్ను ప్రేమించే వారికై కాదు
నేను నన్నే ప్రేమిస్తాను, ఇతరుల కొరకు కాదు.

ప్రకృతి ధర్మానుసారం ప్రతివ్యక్తి ఒంటరివాడే
అంత కర్కశంగా, భయంకరంగా దేవుడు లోకాన్ని సృష్టించాడు.
అలాగే మనిషి అల్ప హృదయాన్ని నిర్మించాడు.

దౌష్ట్యంతో, దుర్మార్గంతో మనిషి మనుగడ సాగిస్తాడు.
సానుభూతి అన్నది మనిషి ఎదలోని బలహీనత
మనిషి మంచితనం నరాలలోని మార్దవత
కారుణ్యం పునరాగమనానికి ఒక పెట్టుబడి
పరోపకార పారీణత అతని ఆహానికి మరొకరూపం
లోకం సేవలు పొందడానికే లోకానికి సేవచేస్తాడు.

నాలోని రాక్షసశక్తి ఒక్కసారి మేల్కొంటే
సాగర మధనంలో అమృతం ప్రభవిస్తే
నేనీ లోకానికి ప్రభువునై పరిపాలిస్తాను.
భగవంతునివలె, మనిషి సుఖదుఃఖాలు అనుభవిస్తాను.

కానీ, భగవంతుడు నాలోని పూర్వ శక్తుల్ని తొలగించాడు.
అందుకు నా హృదయం ముందుగా ఆమోదించింది

వాటితో దాతృత్వాన్ని మించి నేను ఎదిగిపోయినట్లు
ప్రత్యేకమైన కష్టాలలోనే భయంకర తృప్తి పొందుతాను.
బాధలతోనే నేను ఔన్నత్యాన్ని సాధించగలను.

భయంకర రుగ్మతలను అనుభవించేది నేను.
ఈ పైశాచిక కృత్యాలకు కర్తను నేను
నేను పాపం కొరకే ఏర్పడ్డాను, నేను మహాపాపిని.
ఒకరికోసం కాదు. నాకొరకే నేను పాపంచేస్తాను.
ప్రకృతి అప్పగించిన బాధ్యత నెరవేర్చడం నావిధి
ఏడ్చినా, శ్రమించినా, ద్వేషించినా, బాధపడినా — ఒకటే."

సావిత్రి ఆ స్వరం విన్నది, ఆ ప్రతిధ్వనికి ఆమె
కారుణ్య హృదయం ఇలా విన్నవించుకున్నది :

"బాధలను, విషాదాన్ని రూపుదాల్చిన ఓ దేవీ !
దుర్భరమైన ఈ విశ్వవిషాదాన్ని భరించ
సిద్ధపడిన నా ఆత్మలో నీవూ ఒక భాగానివే.
నీ కారణంగానే, మనిషి విధికి తలవంచడంలేదు
సుఖాలు కావాలని విధితో పెనగులాడుతున్నాడు.
నీకారణంగానే, మనిషి ఏదేదో ఆశిస్తున్నాడు.

నీకు ఓరడించే శక్తి వుంది కానీ, రక్షించలేవు.
ఒకనాటికి నేను మహాశక్తిని నా వెంట తెస్తాను
ఆ దివ్యామృతాన్ని నీచేత తాగిస్తాను.
అప్పుడు భగవచ్ఛక్తి నీ నరాలలో ప్రవహిస్తుంది
నీ ఆర్తహృదయాన్ని ప్రజ్ఞ ఓదారిస్తుంది.
నీ అనురాగమే మానవతకు మైత్రీబంధ మవుతుంది.

ప్రేమ, స్వాభావిక కార్యాచరణలో ప్రధానమవుతుంది.
లోకంనుండి విషాదం పూర్తిగా తొలగిపోతుంది.
ఆగ్రహావేశాలనుండి విశ్వానికి విముక్తి లభిస్తుంది.
కఠినత్వంనుండి, రాక్షసప్రవృత్తినుండి స్వేచ్ఛ లభిస్తుంది.
శాశ్వతమైన శాంతిసుఖాలు వెల్లివిరుస్తాయి."

స్వాత్మ ఊర్ధ్వగమనంలో ఆమె ముందుకు సాగింది
కఠినశిలలు, కంచెలు దాటి, మహోన్నత స్థితిని చేరింది
ఒక మందమారుతం హృదయాన్ని పరవశింప చేసింది
సుకుమార లతలు పరిమళాలను పంచిపెట్టాయి
అంతా సౌందర్యంగా, సూక్ష్మంగా, సమున్నతంగా భాసించింది.

అక్కడ గండశిల సింహాసనంగా ఒకదేవత
సువర్ణ పీతాంబరాలు ధరించి, చేత త్రిశూలం
ఢమరుకం ధరించి, సింహంపై కాలుమోపి కూర్చున్నది.
ఆమె అధరాలపై సుందర దరహాసం
ఆమె కనుకొలకుల్లో అగ్ని రోచిస్సులు
శౌర్యసాహసాలు, దివ్యత్వం రూపుదాల్చిన శరీరం
క్షుద్రదేవతలందరినీ తుదముట్టించిన గర్వం.

ఆమె శిరస్సుచుట్టు ప్రకాశమాన కాంతివలయం
ఆమె ధరించిన ఉడుపులలోనే మహత్వదర్పం
ఆమె రూపంలోనే రాజసం, విజయ గర్వం
ఈ మహావిశ్వ రణరంగాన్ని కాపాడుతున్న సైనం
అన్నింటినీ సమానం చేసే మృత్యువును
అన్నింటినీ సమదృష్టితో చూచే నిశీథాన్ని
క్రమానుగతంగా ఏర్పడిన అనేక శక్తుల్ని
మహౌన్నత్యాలు, మహత్తర విలువలు ఆమెవే.

ఆమెలో సత్యం, నిష్కళంకంగా భాసిస్తున్నది
తానే ఆదర్శజ్యోతికి ఆలవాలమైంది
ప్రేమ, ప్రజ్ఞ, బ్రహ్మానందాలకు ఆమె ప్రతిరూపం
నిర్మల కాంతికి, తేజస్సుకు ఆమె ఏకైక ఆలంబనం
మేధ అంతర్లోకాలలో ఆమెస్థానం సుస్థిరం
ఆ శక్తి స్వరూపిణి కాలప్రవాహాన్ని తిలకిస్తూ
ముమ్ముందుకు సాగిపోయే కాలశబ్దాన్ని వింటుంది.
నిర్విఘ్నంగా సాగే గ్రహగతుల్ని వీక్షిస్తుంది.

భగవంతుని అడుగుల భయంకర ఘోషలు వింటుంది
ఆయా మహాశక్తుల విజృంభణంలో, పోరాటంలో
ఆమె మాటకు తిరుగులేదు, అది శాపనం
ఆమె పలుకు ఒక రణభేరి, ఒక యాత్రికగీతం
పతనమయ్యే హృదయాలకు అది ఒక ఆశాకిరణం
ఆమె మధుర స్వరంలో అనురాగం చిప్పిలుతుంది.

''సావిత్రీ, గుప్తమైన నీ ఆత్మను నేను
నేనే ఈ మానవ ప్రపంచంలోకి దిగి వచ్చాను
నా వర్తనం అనుక్షణం పరమాత్మ గమనిస్తూ ఉంటాడు
ఈ భూమిపైన సాగే సురాసుర శక్తుల పోరాటపు
పరస్పర విరుద్ధ నైరాశ్యంలోకి దిగివచ్చాను
ఈలోకపు విషాదాలలో, ప్రమాదాలలో నిలబడి
దురదృష్టవంతుల్ని, భ్రష్టుల్ని రక్షిస్తూ ఉంటాను
బలవంతులకు సత్ఫలితాలను అందిస్తాను
బలహీనులకు నాశక్తిని కొంత పంచియిస్తాను
కోరిన వారికి, కోరుకున్న ఆనందాన్ని ప్రసాదిస్తాను
ఉన్నతుల్ని, పండితులను ప్రజాసముదాయం
కీర్తించేటట్లుచేసి, వారికి న్యాయం చేస్తాను.
ఆ తర్వాత వారిని విధి పాదాలక్రింద నలిపి వేస్తాను
దైన్యజీవుల ఆక్రందనలు చెవి యొగ్గి వింటాను
నియంతలైన రాజుల సింహాసనాలు కూలదోస్తాను
ఈ లోకం నిర్దాక్షిణ్యంగా అణచి వేస్తున్న
పతితులు, భ్రష్టులు ఆర్తిగా నాకు నివేదిస్తారు
చీకటి గుహలలో, ఒంటరిగా బంధీలై
దైన్యంగా, దారిద్ర్యంతో జీవించే వారి మొర ఆలకిస్తాను.
నా రాకతో భగవంతుని శక్తి వచ్చినట్లు వారుభావిస్తారు
భగవంతుని కరుణకు కృతజ్ఞులై ఆనందిస్తారు.
ఈ లోకాన్ని వేధించే రక్కసిని అణచి వేస్తాను
ఆ రక్కసిని రక్తసిక్తమైన గుహలోనే హత్య చేస్తాను.

మహాశక్తి స్వరూపిణినైన దుర్గాదేవిని నేనే
సిరిసంపదలు అనుగ్రహించే లక్ష్మీదేవిని నేనే
మారణ మహాకార్యంలో నిమగ్నమైన మహాకాళిని నేనే
రాక్షస సమూహాల్ని సమూలంగా నాశనం చేస్తాను.

భగవంతుని మహత్కార్యాన్ని నిర్వహిస్తున్నాను నేను
నన్ను పంపిన పరమాత్మకార్యనిర్వహణే నా కర్తవ్యం
భూలోకపు అవరోధాలు, ఆరడులు నేను లెక్కించను
నాకు పుణ్యపాపాల గురించిన చింతలేదు
పరమేశ్వర కార్యనిర్వహణ ఒక్కటే నా కర్తవ్యం
స్వర్గలోకపు ఆగ్రహాన్ని సైతం నేను లక్ష్యం చేయను.
నరకంలోని బాధలు గురించి నేను భయపడను
అసుర శక్తుల ప్రతిఘటనల్ని వమ్ముచేస్తాను.

లక్ష అవరోధాలనైనా అవలీలగా అతిక్రమించగలను.
మనిషిని దివ్యమార్గంలోకి మళ్ళించడమే నాపని
పాపాల నుండి, శాపాలనుండి మానవుని దూరం చేస్తాను
మనిషిచేతులకు దివ్యాయుధాన్ని అందించి
క్షుద్రశక్తులనుండి కాపాడే రక్షకవచాన్ని యిస్తాను
మానవమేధస్సులోని అజ్ఞానపు అహంకారాన్ని ఛేదించి
విస్తృతమైన సత్యంగురించి ఆలోచింప చేస్తాను.

మనిషిని సంకుచిత, జీవిత విజయాలనుండి తప్పించి
కన్నీటితో దివ్యజ్యోతిని దర్శించేటట్లు చేస్తాను
మనిషి భౌతికంగా మరణించి, ఆత్మపరంగా జీవిస్తాడు.
నాకు పరమగమ్యం తెలుసు, దాని రహస్య మార్గం తెలుసు
అదృశ్యలోకాల అనుపానులన్నీ తెలుసు నాకు
రణరంగంలో సేనానిని నేను, మార్గదారను నేను.
కానీ, ఈ మూర్ఖప్రపంచం నాప్రయత్నం నిరోధిస్తుంది
మనిషి హృదయంలోని కుత్సితం, కుటిలత్వం
వివేకం కన్న, నరకం కన్న బలమైనవి.

ఆయా దుష్టశక్తుల, బలవత్తర దుస్వభావాలు
అతిలాఘవంగా విధిని వెనక్కు మళ్ళిస్తాయి.

అది భగవంతుని సంకల్పాన్ని మించినట్లు కనిపిస్తుంది
సృష్టిలోని దోషాన్ని పరిహరించడం అసాధ్యం
నావైపుగా, వెలుగులోకి వెళ్ళేవారికి నేను సహకరిస్తాను
కొందరినే రక్షిస్తాను, మిగిలిన వారు పతనం చెందుతారు
కొందరకే నేను సాయం చేస్తాను, మిగతవారు అపజయం చెందుతారు
నా హృదయాన్ని పాషాణం చేసి, నాపని నేను చేస్తుంటాను.
క్రమంగా ప్రాగ్దిశన వెలుగు విచ్చుకుంటుంది.
క్రమశః లోకం పరమాత్మ పథంలో ముందుకు సాగుతుంది
నే చేసిన పనులలో నా ముద్రవుంటుంది, అది విఫలం కాదు
స్వర్గద్వారాలు తెరచుకున్న సవ్వడులు నాకు వినిపిస్తాయి
ఈలోకపు ఆత్మల్ని పరమాత్మ కలుసుకోవడం నాకు తెలుస్తుంది''

ఆమె పలుకులకు సమాధానంగా, అథోమానవ
ప్రపంచం నుంచి ఒక ప్రతిధ్వని వినిపించింది.
వికృతరూపంలో, బందీగా వున్న క్షుద్రదేవత
తన సహజమైన తిరుగుబాటు స్వభావంతో
ఈ ప్రపంచంపై ఆధిపత్యం వహించాలని,
ఈలోకాన్ని తనకు ఉపకరణం చేసుకోదలచింది

ఈ బృహత్తర ప్రపంచ కామనలోని స్వార్థపరత
భువిని స్వర్గాన్ని మానవోపయోగంగా చేసి
భూమిపై జీవ జాలంలో మనిషిని ఉత్తముని చేసి
తనకు ప్రతినిధిగా 'ఆత్మ'ను ప్రతిష్ఠితం చేసింది.
పరిణామంచెందే కాంతికి, క్రాంతికి సంకేతం చేసి
రావలసిన దివ్యత్వానికి మనిషిని ఆధారంచేసింది.
మనిషి భావనాజీవి, ప్రకృతితో పోరాడగలవాడు
ప్రకృతినే తన చెప్పుచేతులలో ఉంచుకోగలిగాడు.
ఆ సేవలకు ప్రతిఫలంగా, హృదయం విషాదంతో

శరీరాన్ని, మృత్యువుకు బాధలకు గురిచేసి
సహజధర్మానికి తలవంచుతున్నాడు.
మనిషి కష్టాలలో, ప్రకృతి పరిణామం చెందుతుంది
అతని మృతి, ఆమె అమరత్వానికి సహాయకారి
తన బానిసకు తానే బానిస అయి, లోబడి పోతాడు.
తనస్వేచ్ఛా ప్రవృత్తిని తానే ప్రశంసించుకుంటాడు.

మేధావి అయి, ఆమె నిర్దేశించిన మార్గాలలో నడుస్తాడు
శక్తివంతుడైన శక్తిహీనుడు, తాను యజమాని, బానిస
ప్రకృతి సంకల్పానికి, వాంఛకు లోబడి వుంటాడు
అతని ఆత్మ ప్రకృతి అతిథి, అది నిబిడం, జడం
మనిషి శరీరం, జీవనం ప్రకృతి అధీనంలో వుంది
అతని చైతన్యం, ప్రజ్ఞ ఆమె ఆత్మచేసే తిరుగుబాటు --

ఆ స్వరం పెరిగి పెరిగి, అంతర్మండలాన్ని ఛేదించింది :

"భూమిపైని శక్తులన్నింటికీ వారసత్వం నాదే
క్రమంగా ఆత్మ సామ్రాజ్యంపై ఆధిపత్యం సంపాదిస్తాను
ఈ మట్టికి మహిమాన్విత దివ్యత్వం సంపాదిస్తాను
స్వర్గాన్ని అధిరోహించి, నాకం నాది చేసుకుంటాను.
భువిలో చివరన జన్మించినా ప్రాధాన్యం నాదే
కోటానుకోట్ల జీవులు నారాకకై నిరీక్షించాయి
మృత్యువుకు చిక్కి, కాలానుగుణంగా జీవించినా
నా శరీరానికి, ఆత్మకు అధిపతిని నేనే.
నక్షత్ర సముదాయంలో మెరిసే తారకను నేను
ఈ విశ్వం యావత్తు నాకోసమే సృష్టించబడ్డది
నశ్వరమైన మట్టిలో అనశ్వరమైన ఆత్మను నేను.
మానరూపానికి అందని పరమాత్మనూ నేనే
అలా అందకపోయినా, పరమాత్మ 'నేను' అవుతాడు.
సూర్యచంద్రులు నా పథంలో వెలిగే జ్యోతులు.
నా శ్వాస కోసమే ఈ గాలి సృజించ బడ్డది

ఈ మహారోదసి సైతం నిరాటంకంగా నా
రథచక్రాల పయనానికి బాట నేర్పరచింది,
మహాసాగరాలు, నేను వాణిజ్యం చేయడానికి
నా కోసమే సృష్టించ బడ్డాయి.
ఈ సృష్టి నా ఆనందాలను చూచి అసూయపడితే
ఆ వెనుక నున్న మృత్యువును చూచి నేను నవ్వుకుంటాను.
ఈ భూమి నా విహారస్థలం, ఆకాశం ఆటవిడుపు
ఎన్ని యుగాలుగానో నిశ్శబ్దంగా నాకై సిద్ధమైనాయి ఇవి.

మొదట భగవంతుడు జంతు రూపాలతో ప్రయోగాలు జరిపాడు.
అప్పుడు అంతాసిద్ధమైన తర్వాత నేను జన్మించాను
నేను పుట్టినప్పుడు అర్భకంగా, చిన్నగా, అజ్ఞానంలో ఉన్నాను
ఈ సంక్లిష్ట ప్రపంచంలో నేనొక నిస్సహాయ జీవిని.
స్వల్ప జీవితకాలంలో మృత్యువు ప్రక్కనే పయనిస్తూ
ప్రకృతికన్న, భగవంతునికన్న అధికుణ్ణి, మేధావిని అయినాను
ప్రకృతి కలలోనైనా ఊహించనంత వాస్తవంగా మారాను.
ఆమె శక్తులన్నీ స్వాధీనం చేసుకుని, నాకై ఉపయోగించుకున్నాను.
తన లోహాల నుపయోగించి, కొత్త లోహాలు సృష్టించుకున్నాను

పాలనుండి వెన్న తీశాను, పారదర్శకం సృష్టించుకున్నాను
నీటిని ఘనీభవింపచేశాను, ఇనుపకవచం తయారించాను
భగవంతునివలె నేనూ కళాత్మకంగా, ఒకరూపం
నుండి అనేక ఆకారాలు, రూపాలు సృష్టించాను.
ఒకే ధర్మంగల అనేక జీవితాలు తయారుచేశాను
అభేద్యమైన మనస్సు ఊహించగల మేరకు
భౌతిక పదార్థంతో సుస్థిరరూపాలు సృష్టించాను.

నేను సాధించలేని మహత్తులేవీ లేవు
పరమాత్మ అసంపూర్ణంగా వదలినదాన్ని నేను పూర్తిచేశాను
సంక్లిష్టమైన మేధతో, సగమే తయారైన ఆత్మతో
భగవంతుడు చేసిన తప్పులు, పాపాలు నిర్మూలిస్తాను.

తాను సృష్టించలేని దానిని, నేను సృష్టిస్తాను
తాను తొలిసృష్టికర్త. నేను చివరి సృష్టికర్తను.
విశ్వసృష్టికి మూలమైన పరమాణువుల్ని నేనూ కనుగొన్నాను.
అత్యద్భుతమైన తొలి విశ్వ శక్తిని, నా శత్రు
కోటిని తుద ముట్టించడానికై వినియోగించాను
ఒకజాతి మొత్తాన్ని, ఒకదేశాన్ని క్షణంలో నాశనం చేయగలను
ఆనందోత్సాహాల స్థానంలో శ్మశానశాంతి నెలకొంటుంది.
లేదా, అగోచరంగానున్న పరమాత్మశక్తిని,
నా సుఖాలకు, సంపదలకు, భోగభాగ్యాలకు వెచ్చించి
మెరుపు వేగంతో పయనించే నా జీవన రథాన్ని
పరమాద్భుత శక్తులకు ఉపకరణం చేయగలను.

ఆ రహస్యాన్ని భగవంతుని నుండి నేను సంగ్రహించి
అంతకుమించిన అద్భుతాలను నేను సృష్టించాను,
వాటన్నింటి మధ్య ఆలోచనల్ని నిగ్రహించుకుని
నన్ను· నావ్యక్తిత్వాన్ని, ప్రపంచాన్ని పరిశీలించాను
జీవన కళలన్నింటిలోను నైపుణ్యం సంపాదించాను
వన్య మృగాలను మచ్చిక చేసుకుని వాటితో మైత్రిచేశాను
అవి నన్ను, నాఇంటిని రక్షిస్తూ, నా ఆజ్ఞల్ని పాలిస్తాయి
అవి నాకు విధేయంగా ఉండి నన్ను సేవించేటట్లు చేశాను

రోదసీ తరంగాల రహస్యాలను భేదించి,
దూరశ్రవణ, దూరదర్శన సంపత్తిని గ్రహించాను
గగనాన్ని జయించి, భూమికి చేరువ చేసుకున్నాను
త్వరలోనే మేధ రహస్యాలను సైతం కనుగొంటాను
జ్ఞానంతో, అజ్ఞానంతో మెలగడం నాకు తెలుసు
పాపపుణ్యాలు రెండూ నేను కల్పించుకున్నవే
వాటిని జయించగలను, వాటిని దాటిపోనూగలను.

మార్మిక సత్యాలేవో, అతీంద్రియశక్తులేవో నాకు తెలుసు
ఒక్క చూపుతో, భావనతో శత్రువుల్ని హతమార్చగలను

ఇతరుల హృదయగత అవ్యక్తభావాలు తెలుసుకోగలను
మనుషుల మనసులలో దాగిన విషయాలు వినగలను, చూడగలను.
భూమిని జయించిన తర్వాత, పరాన్ని జయిస్తాను
క్షుద్రశక్తులన్నీ నాకు సేవలు చేస్తాయి, దాసోహం అంటాయి
కోరిన కోర్కెలన్నీ తీర్చుకోకుండా నేను మరణించను
విశ్వవ్యాపక శక్తులు, విశ్వాత్మ అన్నీ నేనే అవుతాను"

రణభేరివలె నినదిస్తున్న ఆ స్వరం విన్నది సావిత్రి
ఆత్మ శక్తిస్వరూపిణి అయిన ఆమెతో అన్నది :
"శక్తి స్వరూపిణీ, సృష్టికర్త్రి, తేజస్వినీ,
మానవ మనుగడకు సహకరించి, కష్టాలను
భరించ నిర్దేశించిన నా ఆత్మలో భాగానివి నీవు
నీవు తనలో ఉన్నందునే మనిషి, ధైర్యంగా జీవిస్తున్నాడు
నీ వలనే, మానవాత్మలు స్వర్గాన్ని చేరుకోగలుగుతున్నాయి.
పరమాత్మ సన్నిధిలో దేవతలవలె సంచరిస్తున్నాయి
వివేక శూన్యమైన శక్తి గాలి కెరటం వంటిది
అది శిఖరాలను తాకి, ఆకాశాన్ని చుంబించగలదు
కానీ, పరమాద్భుత పారలౌకిక జగత్తును సృష్టించదు.

మనిషికి బలాన్నివ్వొచ్చుగానీ, వివేకాన్ని యివ్వలేదు
ఆ తేజస్సుతో ఒకనాడు నేను తిరిగి వస్తాను
ఆ పరమాత్మ జ్ఞానఫలకాన్ని నీకు అందచేస్తాను
పరమాత్మవలె, నీవూ నీ ఆత్మను, లోకాన్ని అందులో దర్శించగలవు
పరిశుద్ధమైన నీఆత్మ కాసారంలో ప్రతిబింబిస్తుంది
అప్పుడు నీ వివేకం, నీ శక్తి అంత విస్తృతమవుతుంది.

అపుడు మానవహృదయాలలో ద్వేషానికి తావుండదు
భయాలు బలహీనతలు మానవ జీవితాలను వదలివేస్తాయి
అహంకారం లోలోపలనే అణగి పోతుంది
ఆ సింహగర్జనకు ఈ లోకమే మూర్ఛనలు పోతుంది
అందరూ సచ్చిదానందంలో శక్తిపూర్ణు లవుతారు.''

ఆమె ఆత్మ ఊర్ధ్వగమనంలో మరింత ఎత్తుకు వెళ్ళి
ఒక సముజ్వల, ఆనందమయ శూన్యాన్ని చేరుకుంది.
ఆ విశాల ఉన్నత శిఖరం నుండి సర్వాన్ని వీక్షించవచ్చు
అంతా ఒకేఒక దృష్టిలో కేంద్రీకృతమై వుంది.
దూరానికి భిన్నదృశ్యాలు ఒకటిగా కనిపించినట్లు
రణగొణధ్వనులతో ఒక సమైక్యత ఏర్పడ్డది.
అక్కడి గాలి నిశ్చలం. వాతావరణం సుగంధ పూర్ణం
అక్కడి పక్షుల కలరవాలు, మధుకర స్వరాలు వినిపించాయి
అంతా సహజం, అతి వాస్తవికం, సుమధురం అనిపించింది.

ఆత్మ తన నిజ ఆవాసానికి చేరువైనంత తృప్తి
నిగూఢ విషయాలన్నీ సన్నిహితంగా, సత్యంగా భాసించాయి.
ఆ ప్రశాంత సీమకు తానే కేంద్రం అయినట్లుగా
స్వచ్ఛ తేజస్సులో ఒక స్త్రీ మూర్తి ఆశీనురాలై వుంది.
ఆమె కన్నులలో స్వర్గ సౌందర్యాలు ప్రకాసించాయి
ఆమె పాదాలు చంద్ర కిరణాలు. వదనం సూర్యతేజోబింబం
ఆమె హాసం మృతి చెందిన వానిని సైతం కదలిస్తుంది.
తిరిగి ప్రాణం పోసుకుని జీవించాలన్న కోరిక కలుగుతుంది.

ఆమె మృదు మధుర స్వరంతో ఇలా పలికింది :
"సావిత్రీ ! గుప్తంగా వున్న నీ ఆత్మను నేనే
గాయపడి, నిస్సహాయంగా వున్న ఈ ప్రపంచాన్ని
ఊరడించి, బాధలు తొలగించి మనిషి హృదయంలో
శాంతిని నింపి, 'అమ్మ' వొడిలో విశ్రమింప చేయాలని
పరమాత్మను గురించి కలలు కనే శాంతిని యివ్వాలని
ఉన్నత లోకాల ప్రేమామృతాన్ని పంచిపెట్టాలని
బాధల పల్లవిలో అనురాగం పలికించాలని వచ్చాను.

అందుకే లోకానికి దివ్య తేజోరూపాలను చూపించి
కల్లోల జీవితంలోకి కారుణ్య రోచిస్సులు అందించాను.
ఉదాత్త విషయాలన్నీ యిపుడు సహజ రూపాలే

శక్తి రూపంలోనే అవి ప్రస్ఫుటమవుతాయి.
పోరాటంతో అలసిపోయిన ఎదలోని శాంతిని నేను
మహానరకం మధ్యన మనిషి సుకృతాలతో
దివ్యదూతలకు తనలో ఆశ్రయం కల్పిస్తాడు.
అభయ హస్తంతో ఆశీర్వదించే కారుణ్యం నేను.
కల్లోల జీవనంలో నెలకొన్న ప్రశాంతిని నేను
సృష్టి పటంపైన విజ్ఞానాన్ని వర్షించేది నేను.

పాప పుణ్యాలు, మంచి చెడులు కలగలిసిన మానవ
జీవితంలో అడుగడుగునా వెలుగునీడల సయ్యాటలే.
మనిషి సంపాదించే ప్రతిభ యావత్తు అజ్ఞానమే
మనిషిని సన్మార్గంలోకి నడిపించే శక్తిని నేను
భగవంతుని పక్షాన ఉన్నత శిఖరాలకు చేర్చేది నేను.
మనిషి తప్పిదాలు, పాపాలు పరమపథ సోపానాలు
అన్ని అనుభవాలు వెలుగుకు చిరు రాచబాటలు
మౌన స్థితి నుండి చైతన్యాన్ని స్పందింప చేస్తాను
మృత్యు మార్గంలోనే అమరత్వాన్ని సిద్ధింప చేస్తాను.

మనిషిలోని పరమాత్మ చైతన్య రూపాలు అనేకాలు
అవి అతని నిత్యకృత్యాలను పునీతం చేస్తాయి.
భౌతిక రూపానికి వ్యక్తిత్వాన్ని, విలువను పెంచి
దానిని క్రమంగా దివ్య సువర్ణ మూర్తిగా మలచగలదు
మనిషి పోరాడినా, మరణించినా ఆ పరమాత్మ కొరకే
అసుర శక్తులపై యుద్ధం చేసి సాధించే ధర్మం అదే
చితాగ్ని నుండి 'అమరం'గా నిలిచే స్వాతంత్రం అదే
నిరాశాజీవులకు ధైర్యం చెప్పి రక్షించే శక్తి అదే
జీర్ణమై, పతనమయ్యే కోటకు కావలా తనే
భయంకర నిశీధంలో పహరా కాస్తున్నదీ తనే.

అగ్నికీలలకు ఆహుతి అయిన సత్యాన్వేషి మనిషి
వైరాగ్యాన్ని ఆనందంగా అనుభవించే తపస్వి అతను

కాలం చేసే గాయాలను ధైర్యంతో భరించగలడు
విధితో, మృత్యువుతో పోరాడగల వీరుడతను
ఉన్నతాసనం పైనున్న రూపు దాల్చిన వివేకం తను
యోగి నిర్మల హృదయంలోని నిశ్చలత అది.
అతనే సమున్నత, ఏకాంత దివ్యభావన -
అనేకానేక అజ్ఞానాల కంటే అది విభిన్నం.

తానే మహర్షి వాక్యం. తానే యోగీశ్వర దృష్టి
తానే సౌందర్యం-తానే ఆత్మానంద మధువు
ఆత్మకు ఆవాసమైన 'సత్యం' కూడా అతనే
ఆధ్యాత్మిక లోకాలలోని అన్ని సంపదలు తానే
నిరాశా జీవితాలపై ఆశల కుంభవృష్టి తాను
క్షణక్షణం అమృతత్వాన్ని చేతికి అందిస్తుంది
ఇసుమంత అవకాశంలోనూ దివ్యత్వం నిలుస్తుంది.
మృత్యువు చేతిలో దాగిన "అమృతత్వం" అది.

ఈ శక్తులన్నీ నేనే, నేను కోరినప్పుడు వస్తుంటాయి.
అలా మనిషిని వెలుగుకు దగ్గరగా చేరుస్తుంటాను
కాని మనిషి మేధ అజ్ఞానానికే అంటి పెట్టుకుని ఉంటుంది,
మానవ హృదయం అల్పత్వంతో తృప్తిపడుతుంది.
భౌతిక సుఖాలు, బాధలు తన హక్కుగా భావిస్తుంది.
పరమాత్మ కాలపురుషుని చేయి అందుకున్నపుడు
అనంతత్వం ప్రాపంచికతతో చేయి కలిపినపుడు
మనిషి సర్వస్వతంత్రుడై పరమాత్మలో జీవిస్తాడు.

ఈలోగా నేను దేవతల్ని దివి నుండి భువికి తెస్తాను
నిస్పృహ జనాళికి ఆశను అందిస్తుంటాను.
ఉత్తములకు, సహృదయులకు శాంతినిస్తాను
వివేకులను, అవివేకులను సైతం కనికరిస్తాను
ఉద్ధరణకు సిద్ధమైతే, ఈ భూమినే ఉద్ధరిస్తాను
అప్పుడు లోకంలో 'ప్రేమ' పరివ్యాప్త మవుతుంది.

మానవ మేధ 'సత్య స్వరూపా'న్ని గ్రహిస్తుంది
ఈ శరీరం పరమాత్మ ఆగమనాన్ని భరించగలుగుతుంది"
ఆమె మాటలకు, అజ్ఞాత తిమిరాంధ లోకాల నుండి,
ఒక సమాధానం, వికటాట్టహాసం చేస్తూ వినిపించింది.
మానవ మేధస్సులోని వివేకం కకావికలై,
భౌతిక భావనా పరిధులలోని బద్ధమైన
ప్రాపంచిక అజ్ఞానంలో బందీ అయి పోయిన
పారమాత్మిక శక్తి ఏదో, సగర్వంగా తలెత్తింది.
భౌతిక శరీరంలోనూ, మేధస్సులోనూ బందీ
అయిన మానవుడు 'పరబ్రహ్మ' రూపాన్ని గుర్తించడు.
ఆ బ్రహ్మత్వంలో తనను తాను గుర్తించుకోడు
ఆ పరబ్రహ్మ మన అజ్ఞాన హృదయాలలోనే, మనం
ఊహించని రీతిలో, మనలో కలిసిపోయి వుంటాడు.

మనిషి బాహ్య భౌతిక రూపాలు మాత్రమే చూడగలడు
తన వివేకానికి, ప్రజ్ఞకు, అందనిదేదో ఉన్నదని,
దాని కోసం లోలోతులలో తరచి చూస్తాడు.
వెంటనే ఆగిపోయి, అంతకన్న లోతులకు వెళ్ళడు.
అక్కడ ఆగిపోయి, హృదయంతో ఆడుకుంటాడు.
అతనికి సత్య నగ్న స్వరూపం కనిపిస్తుంది.
ఆయమ అనంత మాయా రూపాలు కలవర పరచినా
ఆంతర్యంలోని ఆత్మ వైపు కన్నెత్తి చూడలేడు.
అపుడు అసలైన జ్ఞానాన్ని తెలుసుకోవాలన్న ఆర్తితో
అన్ని వివరణలు, వ్యాఖ్యానాలు ఛేదించి, లోతుకు పోతాడు.
పైపై రూపాలను కేవలం ఆధారం చేసుకుంటాడు
ఆ ఉత్సాహం, అతని కత్తి దెబ్బతిని, చనిపోతుంది
లేదా ఆ ఆర్తి, చిక్కకుండా తప్పించుకుపోతుంది.
అప్పుడు కనిపించేది ఒకే ఒక్క మహాశూన్యం,
అనంతం నిండుగా పరచుకున్న అద్భుత సంపదలు
ఈ పరిమిత మనిషి తనకోసం ఇక్కడ ఏర్పరుచుకున్నది.

అది ఒక పథకం ప్రకారం వివృత్త మవుతుంది
అది అంతా గుప్తంగా, అతనికి కనిపించకుండా జరుగుతుంది.
వెతికే కళ్ళకు అగోచరమైన "పరం" కనుపించదు.
అతనికున్నది అంధుని సూక్ష్మ గ్రహణ పారీణత
నెమ్మదిగా పయనించే వాని దూరదర్శన చతురత
ఆత్మ వివృత బంధాలేవీ అతనివి కాలేవు
అయినా అతనికి దివ్యదృష్టి సంబంధమైన వెలుగు కనిపిస్తుంది.

అగోచరలోకాల నుండి ప్రేరణ లభిస్తుంది
అతని వివేకం, వివేచన, అన్నీ యదార్ధ మనిపిస్తాయి.
వాటినే ప్రత్యక్ష నిదర్శనాలుగా విశ్వసిస్తాడు.
అలాగు అతని ప్రయత్నం సఫలమై పరిణతి పొందుతాడు.
అతని జ్ఞానం సముద్రతీరంలో మెరిసే రాళ్ళ వంటిది.
అతని అజ్ఞానమే అంతులేని మహా సాగరం
అయినా, ఆ పిలుపులో అద్భుతం వినిపిస్తుంది.
అతని గొంతులో విశ్వకారుణ్యం తొణికిస లాడుతుంది.

''భగవంతుని అజ్ఞాన ప్రపంచపు మహా మేధను నేను
ఆయన సృష్టించిన సోపానాలపై జ్ఞాన శిఖరాన్ని చేరతాను
సర్వాన్ని పరిశోధించగల మానవ దివ్య భావం నేను
భౌతిక లాలసతో, క్షుద్ర శక్తిగా మారింది నేనే
ముళ్ళ కంచెల నడుమ బందీ అయిన పశువును నేను
శ్రమించి, ఆహారం కోసం నెమకులాడే జంతువును
పట్టెడకు, సుత్తికి అంకితమై పోయిన కార్మికుణ్ణి
అయినా దాస్య బంధాలు సడలించుకొని, అవకాశం పొందాను.

గగనాలలో సంచరించి, గ్రహాలను తెలుసుకున్నాను.
శూన్యంలో సంచరించే గోళాలను వర్ణించాను
గోళానికి, గోళానికి మధ్య దూరాన్ని అంచనా వేశాను.
కాలంలో గ్రహ గోళాల మనుగడను లెక్కకట్టాను.
నేల బొరియలలోకి చొచ్చుకునిపోయి, నిక్షిప్తంగా
వున్న రత్నరాసులను, సంపదను వెలికి తీశాను.

రాతి పొరల్ని చీల్చి, శిలా హృదయాన్ని గుర్తించి.
వాటి వాటి చరిత్రల్ని, తారీకులతో సహా రాసుకున్నాను.
ప్రకృతి పధకంలోని ప్రతి పుట నాకు అవగతమే !

సృష్టి పరిణామాన్ని గురించి, వివరంగా నాకు తెలుసు
ఆ మహా వృక్షంలో ప్రతికొమ్మ రెమ్మ నాకు తెలుసు
చరిత్రలో వాటి రూపాల్ని, రూప బేధాల్ని తెలుసుకున్నాను.
జీవంలో వున్న ప్రతి ప్రాణి గురించి నాకు తెలుసు
సృష్టికి మూలమైన జీవకణాలు, ధాతువులు నాకు తెలిశాయి.
మానవుని ప్రాచీన రూపాలు, మూలప్రకృతి అర్ధమైనాయి
మనిషి ఏ స్థితి నుండి ఏ స్థితికి పరిణమించింది
ఎలా పుట్టి, ఎలా మరణించేదీ తెలుసుకున్నాను.
చివరికి మనిషి ఏమయ్యేది మాత్రం అర్థంకాలేదు.

మనిషికి చరమలక్ష్యం ఏమిటి, గమ్యం ఏమిటి ?
ఈ మహత్తర సృజనకు ప్రయోజనం ఏమిటి ?
ఈ మహత్తర శక్తులన్నీ పొంది సాధించేది ఏమిటి ?

సృష్టిలోని రహస్యాలన్నీ, ఏవీ మిగల్చకుండా గ్రహించాను.
సృష్టికి మూలమైన కీలకం నాచేతుల్లోనే వుంది
సృష్టి శక్తులన్నీ నాకై వినియోగించుకుంటున్నాను.
అసంఖ్యాకంగా, అనంతంగా వున్న ధాతువులు,
అదృశ్యంగా, అగోచరంగా వున్న అణు సముదాయం
నేను అన్వేషించిన ఈ పదార్థ భౌతికం ఒక గ్రంథం
ఇంకా చదవవలసిన పుటలు కొన్ని మాత్రమే ఉన్నాయి.

జీవన విధానాలను,మానస వీధులను తరచి చూచాను
పిపీలకంనుండి వానరం వరకు పద్ధతుల్ని పరిశీలించాను
క్రిమినుంచి మానవుని వరకు అన్నింటి ప్రవర్తన తెలుసుకున్నాను
భగవంతుడు చేస్తున్న పనుల రహస్యాలు గ్రహించాను
కాని వీటి మూలకారణం ఏదో అవగతం కాలేదు
అన్వేషించినకొద్దీ సత్యం శూన్యంలోకి జారుకుంటోంది

అంతా తెలిసిన తర్వాత, ఏదీ తెలిసినట్లు అనిపించదు.
ఈ సృష్టికి, పరిణామానికి మూలహేతువు ఏమిటో
నాకిప్పటికి తెలియలేదు, ఎప్పటికీ తెలియదేమో!

ఈ మహత్తర ప్రకృతి ఏర్పడ్డమే ఒక మహాద్భుతం
ఆలోచనలకు కేంద్రమైన మానవ మేధ మరీ అద్భుతం
అసలు జీవంలోని ప్రాణశక్తి మరీమరీ విచిత్రం
నేను తెలుసుకున్న దాన్ని, అవకాశం వ్యతిరేకిస్తుంది
నేను నిర్మించుకున్న దాన్ని, విధి ముక్కలు చేస్తుంది
భౌతికశక్తి చేయించే పనులు నేను ఊహించగలను.
కాని, మనిషిని విధి ఎటు నడిపిస్తుందో మాత్రం తెలియదు.

తాను కోరని మార్గాలలో విధి మనిషిని నడిపిస్తుంది
ఆ విధిచక్రం క్రింద పడి మనిషి నలిగిపోతుంటాడు
మహత్తర తాత్విక సిద్ధాంతాలన్నీ నా ఊహాగానాలే
మానవాత్మ వాంఛించే మార్మిక స్వర్గాలన్నీ
మేధస్సు సృష్టించుకునే భావనాలోకాలే
అన్నీ కరిగిపోయే కలలు, కల్పనా విశేషాలు
కడకు ఈ ప్రపంచమే ఒక సంశయం అవుతుంది.

అల్ప ప్రకంపనంతో రూపురేఖలు మారిపోతాయి
అపరిమితంలోని పరిమితరూపం హేళనచేస్తుంది
బహుశః ఈ ప్రపంచమే మన దృష్టిదోషం కావచ్చు
వివేకపు ప్రతి మెరుపులో ఒక విడ్డూరం కనిపిస్తుంది
అసత్తయిన వాస్తవంతో అవాస్తవమైన మేధ
ఆత్మకు రూపాన్ని కల్పించడానికి ప్రయత్నిస్తుంది
ఒక మాయపొర సృష్టికాని శూన్యాన్ని క్రమ్మివేస్తుంది.

నేను ఊర్ధ్వ చైతన్య స్థితికి చేరుకున్న మాత్రాన
అశాశ్వతమైన వాస్తవాన్ని నా ఆలోచనతో
జయించినంత మాత్రాన ప్రయోజనం ఏమిటి ?
అశరీరి అయిన ఆత్మను అన్వేషించినా, లేక

అగోచరమైన దాన్ని అన్వేషించడమే లక్ష్యం అయినా
నాకు ఒనగూడే లాభం, ప్రయోజనం ఏమిటి ?
అందుకే భౌతిక పరిధిలోనే నాకృషి కొనసాగుతుంది.
పారలౌకికంగా ఆలోచించి, జీవించి ప్రయోజనం లేదు.
ఈ అల్పత్వం మనల్ని అనంతం నుండి రక్షించదు
మహత్తర ఏకాంతంలో ఒంటరిగా ఉంటున్న నన్ను
శాశ్వతంగా మృత్యువాత పడమని ఆహ్వానించకు.
నాది అనుకున్న మానవత్వాన్ని వదలిపెట్టి,
ఆత్మ వైన అపరిమితస్థితిలోకి నన్ను ఆహ్వానించకు
ప్రతిజీవి తన ప్రకృతి స్వభావంతోనే జీవిస్తుంది
కనుక సహజమైన విధిని తప్పించుకొనడం అసాధ్యం ;
నేను మనిషిని. నన్ను మనిషిగానే బ్రతకనివ్వండి చాలు.
శాశ్వతంగా కన్నుమూసేవరకు మనిషిగా మననివ్వండి
ఇదొక మహత్తర ప్రలోభం, ఇదొక మాయాజాలం
ఈ మట్టిలోనే భగవంతుడున్నాడని ఆలోచించడం
పరమసత్యం కాలంతోనే ముడిపడివుందనుకోవడం
ఆత్మను లోకాన్ని ఉద్ధరించమని అంగలార్చడం !
మనిషి ఎలా అమరుడు, మృత్యుంజయుడు కాగలడు ?
తన భౌతికస్థితిని వదలిపెట్టకుండా ఎలా ఉండగలడు ?
అవి దేవతలకే సాధ్యం మనుషులకది అసాధ్యం.''
యుద్ధనినాదంవలె వినిపించిన ఆ మాటలు విన్నది.
తన ఆత్మ తేజస్సు నుద్దేశించి సావిత్రి అన్నది :
''ఓ తేజస్వినీ! శాంతికి, ఆనందానికి నెలవైన మాతా !
విస్మృత శిఖరాగ్రాలపైకి ఆత్మశక్తిని చేర్చే
నాలోని అంతర్ శక్తిలోని ఒక భాగానివి నీవు
దివ్యస్పర్శతో ఆత్మను నీవు మేల్కొల్పగలవు,
నీ వలననే ఆత్మ పరమాత్మను చేరుకోగలదు
నీ కారణంగా ద్వేషంఉన్నా ప్రేమ ఉద్దీప్తమవుతుంది
నిశీథంలో ప్రజ్ఞ అవ్యవహితంగా ప్రదీప్తమవుతుంది

కఠినాతి కఠినమైన మేధ శిలాభూములపైన
దివ్య సువర్ణ వర్షధారలు కురవకుండా,
ఈ భూమిపైన స్వర్గ పారిజాతం ఎలా పుష్పిస్తుంది ?
జీవన తరు శాఖలపై దివ్యశాబకం వాలి ఎలా విశ్రమిస్తుంది ?
నందన సౌరభాలు భౌతిక ప్రపంచంలో ఎలా గుబాళిస్తాయి ?

నీవు ప్రజ్ఞాకిరణాలను భూమిపైన వర్షింపచేసినా
అవి భౌతికమైన మెరుపులని మనిషి అపోహపడతాడు
అతని ఆత్మశక్తి. ఆ అహంకారంలో కరిగిపోతుంది.
సన్యాసాశ్రమంలో, ఏకాంతంగా ఆత్మ కలలు కంటుంది
అక్కడనే పరమాత్మనీడ తనలో ప్రవేశించే వీలున్నది.
మనిషి పరలోక ఆర్తిని తీర్చవలసింది నీవు
మనిషి హృదయంలో దివ్యాగ్నుల్ని రగిలించేది నీవు
మనిషి శరీరంలోకి, జీవితంలోకి పరమాత్మను
ఆవాహన చేయవలసింది నీవు, ఆపరమాత్మ శక్తితో
ఒకనాటికి నేను ఇక్కడకు తిరిగి వస్తాను.
ఆ నిర్గుణ సచ్చిదానంద రూపాల్ని నీవూ చూడగలవు.

అప్పుడే సరమపవిత్రమైన సంధానం జరుగుతుంది
అప్పుడే ఈ లోకం దివ్యలోకంగా భాసిస్తుంది
లోకాలన్నీ కాంతితో శాంతితో నిండిపోతాయి."

# ఆత్మదర్శనం

ఆ దేవీత్రయాన్ని దాటి సావిత్రి హృదయగుహలో, గుహ్యంగా వున్న ఆత్మకై అన్వేషిస్తూ ముందుకుసాగింది తొలుత పరమాత్మికమైన చీకటిని చేరుకున్నది. ఆ చీకటిలో ప్రాపంచికమైన విద్య, వివేకం, విజ్ఞానం, సత్యం—మొదలైన వానికి సరైన అర్థాలు, నిర్వచనాలు కనిపించాయి. అదంతా మహాసముద్రంలో ఒక నీటికణం కలిసిపోయినట్లు అనిపించింది. ఆ చైతన్యం నుండి, ఒక కొత్త జీవస్పందన ఏర్పడ్డది. కలలు ఫలించి గులాబులు విరబూశాయి. చీకటి విచ్చుకుని పగలైంది-మధుర పరిసరాలు, ఆనందాలు వెల్లివిరిసిన చిదాకాశం-ఆత్మ దాగివున్న 'గుహ' అనుభూతికి అందసాగింది.

ఆ గుహ ద్వారానికి కాపలా వున్నవి రెండు భయంకర సర్పాలు —ఒక కాల విహంగం-మందిరంపైని గూళ్ళలో పావురాల నిస్వనాలు - ఆ గుహలో గోడల నిండా దేవతా శిల్పాలు—అనేక మండలాల అవర్ణ, సవర్ణ చిత్తరువులు—అది అంతా పరమాత్మ సామ్రాజ్యమే. జననం, జీవనం, మృత్యువు - తిరిగి మరణాతీతస్థితికి చేరడం-సావిత్రి వాటి అర్థాలను అవగతం చేసుకున్నది. ఆమె ఆత్మ వాటితో తాదాత్మ్యం పొందింది.

తానే జగన్మాత-తానే సరస్వతి—తానే పార్వతి—తానే రాధ — ఆరాధింపబడేది తనే. చివరకు అరూప స్థితిని చేరుకున్నది. దివ్య, తేజో మందిరాన్ని దాటి "ఆత్మ'' స్థావరాన్ని చేరుకున్నది.

దీర్ఘ నిశి ప్రయాణం అయిపోయింది. సావిత్రి తన ఆత్మ లోకాలన్నీ దర్శించింది. అన్ని ప్రాకారాలు దాటింది. అనేక దేవతల విగ్రహాలు చూచింది. భక్తులను దర్శించింది. కళాయాయులైన, శిల్ప భూషితాలైన కుడ్యాలు, స్తంభాలు తిలకించింది. ఆ గోడలపై చెక్కబడిన పురాణగాధాచిత్రాలను చూచింది. తాండవ నృత్యం వీక్షించింది. చివరకు తన ఆత్మను తాను దర్శించింది.

తిరిగి మానవ ప్రపంచంలోకి వచ్చింది. కాని ఆమె పూర్వపు సావిత్రి కాదిప్పుడు—ఆమెలో దివ్య శక్తి నిండి వుంది. ఆమె సంపూర్ణంగా మారి పోయింది, ఆధ్యాత్మిక విలువల్ని సంతరించుకుంది. ఆమె చేసే ప్రతి పని, భగవత్ కార్యమే-శిరస్సు, భ్రూమధ్యం, కంఠం, హృదయం, నాభి, మూలాధార కేంద్రాలన్నీ, రేకలు విచ్చుకున్న పద్మాలైనాయి. నూతన దివ్యత్వం ఆమెలో ప్రవేశించింది. మానవ రూపంలో వున్న సావిత్రిలో తొలిసారిగా సమగ్రత, సంపూర్ణత ప్రవేశించింది.

ఆత్మకు నెలవైన మార్మిక గుహను అన్వేషిస్తూ ముందుకు సాగింది.
ప్రధమంగా ఆమె పరమాత్మ నిశీధంలో ప్రవేశించింది.
క్రామిక జగత్తుకు సహకరించే వెలుగు అక్కడ లేదు.
మన జీవితాలను కల్లోల పరచే శక్తి అక్కడ లేదు.
ఈ అసమర్థ మేధ అక్కడ ఆలోచించడం మానివేస్తుంది.
ఈ ఆరాట హృదయం తన ఆశలకు స్వస్తి పలుకుతుంది.
సర్వవిజ్ఞానం విఫలమై భావరూపాలన్నీ నశించి
వివేకం కనుమరుగై తలవంచుకున్నది.
భాషకు, భావానికి అందని ఒక మహోన్నత సత్యం
రూపరహితంగా, అనశ్వరంగా అనుభూతికి అందింది.

అమాయకంగా, పవిత్రంగా వున్న అజ్ఞానం,
నిర్గుణ పరమాత్మను ఆరాధిస్తున్నట్లు తోచింది
అగోచర తేజస్సు తనదికావాలని వాంఛించలేదు
నిరాడంబరంగా వున్న పవిత్ర శూన్యంలో
ఆమె మనస్సు అగోచరం ముందు మోకరిల్లింది

అనాచ్ఛాదనంగా వున్న ఆత్మవినా సర్వం రహితమై
ఆత్మ సమర్పణ కావించే భావన ఒక్కటే మిగిలింది.

ఆమెలో ఇప్పుడు బలంలేదు, గర్వం అహంకారం లేదు
భగభగమండే వాంఛలు సిగ్గుతో చల్లబడిపోయాయి
ప్రత్యేక అహంకారం, ఆత్మౌన్నత్యం సైతం సమసిపోయాయి
ఆమె స్వర్గాన్నిగానీ, మోక్షంగానీ కావాలని కోరలేదు
మానవత్వమే సగర్వంగా వాంఛించ తగ్గ మహోస్థితి
తన ఆత్మ అన్నదిలేదు, ఉన్నదొక్కటే పరమాత్మ
ఆ పరమాత్మ తనకు తెలియదు, ఉన్నాడనిమాత్రం తెలుసు.
తనలో నిండుగా పవిత్రమైన చీకటి అలుముకుంది.

ఈ ప్రపంచమే మహాంధకారంగా. నగ్నంగా తోచింది
లోకాలకన్న శూన్యమే బలవత్తరం అనిపించింది
ఆ శూన్యమే కాలం మోయలేనంత బరువనిపించింది
ఆ చీకటే, అగోచర పరమాత్మను తెలియచేయగలదు
కాని, సర్వం నిరాకారం, నిర్గుణం అనంతం, నిశ్శబ్దం.
ఛాయా రంగస్థలంపైన ఒకనీడ నడచి వెళ్లినట్లు
అవ్యక్త అగాధ నిశీధ గర్భంలో నుండి, ఒక
చిరు నిశీధం వ్యక్తిగా, రేఖామాత్రంగా కదలినట్లు
ఆమె నిశ్శబ్దంగా, నిర్గుణంగా, శూన్యంగా పయనించింది.
ఆమె ఆత్మ అనంత కాలాన్నిదాటి విశాల తీరాన్ని చేరింది
నిరవధిక శూన్యమే ఆమె ఆత్మకు ఆశ్రయమైంది.

చివరకు ఒక పరిణామంతో శూన్యం బ్రద్దలైంది.
లోలోపల ఒక తరంగం కదలి, విశ్వమే కల్లోలమైంది
మరొకమారు ఆమె అంతరంగం ఆమెకు ఆశ్రమమైంది.
గమ్యానికి చేరువవుతున్న ఆనందం అనుభూతమైంది.
స్వర్గమే దిగివచ్చి పవిత్రగిరిని చుంబించింది
వాతావరణం ఆనందంతో, ప్రేమతో పులకించింది.

స్వాప్నిక తరుశాఖలపై ప్రజ్ఞా సరోజం విరబూసింది.
వెన్నెల సంధ్యను దాటి ఉషస్సు తొంగిచూచింది.
తెల్లవారగానే, ఆనందమే నివేదనగా, ఆమె
నిశ్శబ్దంగా లోకారాధనకు పూనుకున్నది.
విశ్వపురుషుడు ఆనందాలను అంబరంగా
స్వర్గాన్ని కాషాయపు వల్లెవాటుగా ధరించి
నుదుట ఎర్రని సూర్యుని తిలకంగా దిద్దుకున్నాడు –
ఎన్నడో విస్మరించిన కల యదార్థం అయినట్లు
ఆకాశపు అనంత శోభలను ఆమె గుర్తించింది.
ఆ వాతావరణంలోని మాధుర్యాన్ని తలపోసింది
ఆమె తన మనస్సుతోనే ఆ మాధుర్యాలను చూచింది
మనస్సుతోనే తన జీవన విధానాన్ని తెలుసుకుని,
పవిత్ర గిరిలోనున్న మార్మిక గుహాలయాన్ని గుర్తించి,
అందులోనే తన ఆత్మ రహస్యంగా ఉన్నట్లు తెలుసుకుంది.
ఏవేవో అతీంద్రియ, మార్మిక అగాధాల దాగినట్లు
సత్యం భావనకు సైతం అందనంత లోతుల దాగింది
అదేదో పర్వతాల నడుమ దేవాలయంలో దాగినట్లు
ఆరాధించే ప్రపంచానికి దూరంగా భగవంతుడు ఉండిపోయాడు.
అది జీవుని అంతరింద్రియానికి సైతం అందనంతదూరం
అది హృదయ వాంఛలలో చిక్కకోనంతటి దూరంగా పోయింది.
ఆమె కళ్లకు పరమాద్భుతమైన సంధ్యవెలుగు సోకింది
ఆ ప్రశాంత శూన్యంలో పవిత్రమైన నిశ్చలత్వం నిండింది.
ఆ బృహత్తర శిలాకవాటాలను భయంకర చీకట్లు ముసిరాయి
అది భౌతికమైన సమాధి స్థితిలోనిశ్చలంగా మారింది
రెండు సువర్ణ సర్పాలు, మెలికలు తిరిగి, పెనవేసుకుని
తమ భయంకర పవిత్ర శక్తులతో, చుట్టివేసి
క్రాంత దృష్టితో, నిగూఢ ప్రజ్ఞతో చూడసాగాయి.
విశాలమైన పక్షాలతో కబంధం దాన్ని కప్పివేసింది.
నిశ్చల స్వప్నంలో ఆత్మ విస్మరించిన అగ్నిశిఖలు

ఆలయ గోపురాలపైని పావురాల కువకువలు—
శాంతిని ముద్దులుగా చేసి, శిల్పి మలచిన పావురాలవి.
ఆమె తొలి ద్వారంలో కాపున్న 'నిద్ర'ను దాటిపోయింది.
అనేకానేక దేవతామూర్తులను దర్శించగలిగింది.
అవి శిలాశిల్పాలైనా ఊపిరిలేని సజీవ మూర్తులు.
అవి నిశ్చలంగా మానవాత్మల్ని గమనిస్తూ
విశ్వాత్మకు కార్యనిర్వాహక ప్రతినిధులైనాయి.
అనశ్వర మహాశక్తులకు అవి ప్రాపంచిక సంకేతాలు.
ఆ కుడ్యాలపై నున్న రకరకాల చిత్తరువులు, మానవ
జీవన విన్యాసాలను, జంతువుల జీవనహేలను
దేవతల జీవితాల అంతరార్థాలను
అసంఖ్యాక లోకాల అవసరాన్ని, అవకాశాన్ని
వాటిలోనున్న జీవుల గురించి, రోదసి గురించి
ఒక్కొక్క మండలాన్ని అధిరోహించే కొలదీ
అందే సందేశాలను, ఆ చిత్తరువులు వివరించాయి.
అవి అనంతంగావున్నా అమరత్వానికి ప్రతినిధులు
అవే పరమాత్మ విస్తృతికి, వివరణకు ప్రతినిధులు
అవి అన్నింటినీ అందుకోడానికే అక్కడ వున్నాయి
మనిషిచేసే చిన్నపనులు, ఘనకార్యాలు, ప్రేమలు
జననాలు, మరణాలు, మరణాంతర జీవితాలు
ఆపైన అమరత్వాన్ని చేరుకోవడం కనిపించింది.
అవి అన్నీ కడకు అమరత్వాన్ని చేరవలసిందే—
పవిత్రమైన అస్తిత్వం, అన్నితావుల ఒక్కటే.
నిసర్గచైతన్యం, నిష్కల్మషమైన శక్తి
అనూహ్యమైన నిర్గుణ బ్రహ్మానందానికి
కాలానికి కట్టుబడిన ఆనందానికి, కాలానికి
అతీతంగా వుండి కనిపించని మార్మికతకు

అన్నీ తానే అయి, అన్నింటిలో తానుగా చరిస్తూ
దేనినీ అంటక, దేనికీ అంటక వుండేది ఆ పరమాత్మ.
అక్కడ మానవ ఉచ్ఛ్వాస నిశ్వాసలు వినిపించవు.
కేవలం 'ఆత్మ'కు సన్నిహితంగా ఉన్న భావుకత !
అక్కడ అన్నిలోకాలు పరమాత్మలోనే ఉన్నాయి
అక్కడ ప్రతి సంకేతానికి వాస్తవికత వుంది
వాటికి జీవంపోసిన పరమాత్మకు ప్రతీది సంకేతమే.

ఆమె వాటినంతా గమనించింది, అనుభూతి పొందింది
అది ఆలోచనకు, మనస్సుకు అందనిది, అది ఆత్మగతం
అక్కడి వెలుగు రవిది, శశిది, అగ్నిది కాదు
అది అంతరంగ తేజస్సు, లోపలనే కనిపిస్తుంది.
అది అత్యంత ఆత్మీయంగా, సన్నిహితంగా వుండి
ఎంతటి రహస్యాన్నైనా అది చూపించగలదు.
మనదృష్టి, వివేకం మనల్ని మోసగించవచ్చు
కాని 'ఆత్మ' చూడగలిగినదంతా యదార్థమే !

అలాగ ఆమె మార్మికలోకంలో పయనించింది.
కఠిన శిలా నిర్మితాలైన ద్వారాలు, గదులు దాటింది
తాను చూచిన అన్నింటిలోనూ తననే చూడసాగింది
తనలో భృక్తంగానున్న 'తన్మయత' మేల్కొన్నది
తానే పరమాత్మకు ప్రీతిపాత్రమని తెలుసుకున్నది
ఈ దేవుళ్లు, దేవతలు అందరూ తామిరువురే.
ఈ సౌందర్యానికి, ఆనందానికి జగన్మాత తాను
బ్రహ్మదేవుని అమేయసృష్టిలోని వాగేశ్వరి తానే
పరమ శివుని పర్యంకంపై నున్న ఆదిశక్తి తానే
అందరు జీవులకు ఆధారమైన ఆత్మగురువు, జగన్మాత తామే
తమ అనుబంధమే ఈ లోకాలను సృష్టించింది.
అది రాధాకృష్ణుల శాశ్వత బ్రహ్మానంద సమైక్యత
ఆరాధకుడు, ఆరాధనీయ ఆత్మపరంగా ఒక్కరే !

కడపటి మందిరంలో, బంగారు సింహాసనంపైన
ఏ దృష్టి నిర్వచించలేని ఒక మూర్తి ఆసీనమైంది
ఈ లోకంలో అందుకో వీలులేని అమలానందం అది
అది ఒక మహత్తర శక్తికి ప్రాతినిధ్యం వహిస్తుంది
అది అగోచరసౌందర్యం, విషయవాంఛకు పరాకాష్ట.
ఆ సూర్యతేజం ముందు సర్వవిజ్ఞానం ఒక కిరణమే
ఆ ఔన్నత్యం లేనిదే జీవితం అసలు ఏర్పడదు.

ఆపైన సర్వము నిశ్శబ్ద ఆత్మలో లీనమైంది
సర్వం రూపరహితం, నిర్గుణం, నిర్మలం అయింది.
గండశిలను తొలిచి మార్గం ఏర్పరచుకున్నట్లు
అహీనకాంతి ప్రకాశించే తావుకు ఆమె చేరుకున్నది.
అది తేజస్సు, ఓజస్సు సమ్మిశ్రితమైన మందిరం
మార్గంలేని మహాగ్నికుడ్యాలను ఛేదించి పోగా
ఆమె తన నిగూఢ ఆత్మస్థావరాన్ని కనుగొన్నది.

సమాధి స్థితిలో జీవుడు అజేయంగా, అమరంగా నిలిచి
జీవన్ముక్తునివలె ప్రాపంచిక విషయాలలో సంచరిస్తాడు
అతని విశాల నేత్రాలలో అమలిన ఆనందదీప్తులు
ఆ నైర్మల్యాన్ని విచారాలు, విషాదాలు కదిలించవు
భౌతికవిషయాలపై అలౌకిక ఆధ్యాత్మిక దృష్టి.
కాలాన్ని నిశ్శబ్దంగా, నిర్మోహంగా గమనిస్తూ
అనంత జగన్నాటకంలోని దృశ్యాలను తిలకిస్తూ
పరమాత్మ సంకల్పంలో వైచిత్రికి అనుగుణంగా
ఈ విశ్వలీలా వినోదంలో తన పాత్ర తను ధరించి
పరమాత్మకు తానే చైతన్య ప్రతినిధి అయి
మానవ లోకంలో భగవంతునికి తానే ప్రతినిధి అయి
విశ్వమిత్రుడై, విశ్వ తేజః కిరణమై భాసించి
ఆమె తిరిగి తన భౌతిక శరీరంలోకి వచ్చింది.
కాలానికి, పరిస్థితులకు అనుకూలంగా మారిపోయింది.

ఆమె మనుగడే ఈ లోకానికి పరమానందదాయకం
జగత్ క్రీడపై మమకారం ఆమె కన్నులలోని వెలుగు
భౌతిక సుఖదుఃఖాలకు ఆమె పెదవుల లాస్యం పిలుపు
ఆనందాలు, విషాదాలు చిరునవ్వుతో స్వీకరించింది
ఆమె చూచినవన్నీ పరమసత్యానికి ప్రతీకలే
అవి అన్నీ అజ్ఞానం అనే ముసుగులు ధరించాయి.
కొన్ని ఏండ్లు గడచి అమరత్వాన్ని చేరుకోగలవవి.
ఆమె నిగ్రహంతో ప్రశాంతితో వాటిని భరించగలదు.

ఆమెకు మనోవేదనలు, జీవనశ్రమలు తెలుసు
కన్న తల్లికి తన బిడ్డల బ్రతుకు బాధలు తెలుసు.
ఆమె తనలోని ఒకింత భాగాన్ని పంచియిస్తుంది.
జీవం అంగుష్ట పరిమాణాన్ని మించి ఉండదు.
అది హృదయంలో ఏమూలనో నిగూఢంగా ఉంటుంది.
అలావుంటూ ఆనందాన్ని మరచి కష్టాలను భరిస్తుంది
బాధల్ని పంచుకుని భౌతిక వ్రణాలను సహిస్తుంది
గ్రహానుగతికంగా తానూ పరిశ్రమిస్తుంది.

అది మనలోవుండి నవ్వుతూ, ఏడుస్తూ, బాధలనుభవిస్తుంది
విజయాలకు పొంగిపోతూ, అధికారానికి ఆరాటపడుతుంది.
తానే శరీరం, మనస్సు, జీవం అయిపోయినట్లు
ఓటములు, కష్టాలు తనవిగానే అనుభవిస్తుంది
విధిదెబ్బలకు గాయపడి, శిలువపైకి ఎక్కుతుంది
అయినా ఆత్మ అక్షయం, అది వేదనలకు అతీతం.
అది మానవ రంగంలోని పాత్రధారికి సహకరిస్తుంది.

తద్వారా ఆమె తన ప్రతిభను శక్తుల్ని మనకందిస్తుంది
అగాధవిషాదాలు దాటించి, విజయశిఖరాలకు చేరుస్తుంది
నిత్యనైపుణ్యత్రికాలలో అవసరమైన ధైర్యాన్నిస్తుంది
సానుభూతి పంచియిచ్చి, మన విచారాలు తొలగిస్తుంది.
మానవజాతికి మనంచేసే అల్పసాయానికి అదే బలం.

ఈ జగత్తు తన పాత్ర తాను నిర్వహించడానికి
మానవ రూపంలో మనదైన చిన్నపాత్ర మనమూ ధరించాలి
యాతనామయ ప్రపంచాన్ని మన భుజస్కంధాలపైన మోయాలి.

మనలో నెలకొన్న అతిస్వల్పమైన దివ్యత్వం అది
మానవ రూపంలో నెలకొన్న దివ్యత్వంలో
అవసరార్థం ఆమె పరమాత్మపాత్ర నిర్వహిస్తుంది
ఒక వెలుగుదాటి మరొకవెలుగు. ఒక శక్తితర్వాత మరోశక్తి
చివరకు దివ్యశిఖరాగ్రాలపై అగ్రగామిగా నిలుస్తుంది.
బలహీన శరీరంలో హృదయం అజేయంగా వుంటుంది
వణుకుతూ ఆరోహించినా, అదృశ్యహస్తం అందుకుంటుంది,
భౌతిక శరీరంలోని ఆత్మశక్తి పరిక్రమిస్తుంది.

ఇక్కడ జ్యోతిర్మయ మందిరంలో వారు కలుసుకున్నారు
ఒకరి నొకరు చూచుకొని ఎవరెవరో గుర్తించారు
ఒకరు రహస్యదేవత, ఒకరు దాని మానవరూపం
ఒకరు ప్రశాంతపరమాత్మ, ఒకరు కల్లోలితాత్మ
అవి రెండూ అత్యద్భుత పరిణామ వేగంతో
ఒక దానితో ఒకటి చేరి, ఒకటిగా మారిపోయాయి.

ఆమె తిరిగి మానవ స్వభావంతో భూమికి దిగి వచ్చింది
భయంకర నిశీథిలో, వర్ష తప్త మహారణ్యం మధ్యన
జీర్ణ పర్ణశాలలో, అంతవరకు సమాధిలో వుంది
అంతర్దృష్టిలో వెలుగుతెర వెనుక దాగిన
సూక్ష్మ ప్రపంచం క్రమంగా అంతరంలోకి జారిపోయింది.

కాని ఇప్పుడు అరవిరిసిన ఆమె హృదయకమలం
పూర్ణంగా వికసించి, భౌతిక కాంతికి అభివ్యక్తమైంది
ఒక తేజోమూర్తిగా ఆమె ఆత్మ ప్రకాశించ సాగింది.
ఆత్మను మనస్సును వేరుపరచే అడ్డుగోడ లేదక్కడ
జీవునకు అందకుండా చేసే మార్మిక రహస్యాలు లేవు
అంతరంగ హృదయ పద్మంలో ఆమె ఆత్మ స్థిరపడ్డది

చలువరాతి పీఠంపైన ధ్యాన ముద్రలో ఉన్నట్లున్నది,
మహాశక్తి అయిన జగన్మాతను, ఈ లోకాన్ని తన
ఆవాసం చేసుకోమని ప్రార్థిస్తున్నట్లున్నది.

ఏదో దివ్యతేజస్సునుంచి ఒక మెరుపు విడివడి
మౌళికమైన మహాశక్తి సజీవ రూపం ధరించి
ఒక ఆకృతితో, సుందరంగా ఆమె హృదయం చేరి
ఆ పవిత్ర హృదయాన్నే తన మందిరం చేసుకున్నది.
దాని పాదస్పర్శ చలితచైతన్యాన్ని సోకగానే
అంతర్ జగత్తు ఒక్కసారిగా చలించిపోతుంది
విశ్వమే కంపించిపోగా ఆత్మ దర్శనమిస్తుంది.

ఈ అజ్ఞానపు అనాత్మ, అభావ అంధకారం నుండి
నిద్రలేచినట్లు ఒక సర్పం బుసకొడుతూ పైకిలేచింది
అది చుట్టు విడిపోయి నిట్టనిటారుగా లేచినిలిచి
తీవ్రవేగంతో. తుఫాను హోరుతో పైకి ప్రాకుతుంది
అది అన్ని జ్ఞానకేంద్రాలను స్పృశిస్తూ సాగుతుంది.

ఒక దివ్యస్పర్శతో గాఢ సుషుప్తి నుంచి మేల్కొన్నట్లు
ఆ కేంద్రాలు వెలుగులో, బ్రహ్మానందంతో పులకించి పోతాయి.
అది సమున్నత స్థాయిలో పరబ్రహ్మస్థితిని పొందుతుంది.

మూలాధార కేంద్రం నుండి సహస్రదళపద్మంవరకు
అన్నికేంద్రాలలోనూ దివ్యత్వం చిప్పిలుతుంది.
అగోచర శక్తులు, అతీంద్రియ, పారలౌకిక
శిఖరాలనుండి ప్రవాహసదృశంగా జారి
మనలను ఈ ప్రాపంచికత నుంచి రక్షిస్తాయి.
అనంత రోదసిలో ఆత్మ ప్రస్ఫుటం అవుతుంది.
ఒకానొక మూలశక్తి ఆకృతి దాల్చినట్లు
జగన్మాత రూపురేఖలతో దర్శన మిస్తుంది.

అనితర సాధ్యమైన మహాజ్ఞానానికి సంకేతంగా
ఆ మార్మిక శక్తిని ఆయుధంగా ధరించింది.

బహురూపాల ప్రత్యక్షమయ్యే శక్తి స్వరూపిణి
ఒక చేయి అభయ ముద్రగా, విశ్వశక్తికి
సంకేతం అయింది - ఆమె పాదాల ముందల
భయద భీకర సింహం నాల్కలు సాచుతూవుంది.
దానిచూపులలో జీవశక్తి అగ్నిధారలుగా వుంది
సర్వమూ దివ్య పరిణామానికి లోనైంది.

అజ్ఞానాంధకార బధిర మహాకుడ్యాన్ని భేదించి
అవిద్యా వలయాల తెరలను తొలగించి వేస్తూ
అమరత్వాలు, అమృతశక్తులు ఉవ్వొంగివచ్చాయి
జీవుని ప్రత్యణువు పరమానందంతో పులకించింది
ఆనంద తరంగాలతో శరీరం శోభనమైంది
ప్రతిచోట ఆ దివ్య మూర్తి ప్రభావం ద్యోతకమైంది.
ప్రతి అణువులో కణంలో ఆ మూర్తి ప్రభావమే.

శిరస్సు లోని అరవింద కేంద్ర స్థానంలో
భాసించే మేధ సర్వాన్ని ఆక్రమిస్తుంది.
భ్రూమధ్యస్థానంలోని పద్మక్షేత్రంలో
దివ్యదృష్టి, సంకల్పం కిరణాలుగా ఏర్పడుతాయి.
తామరతూడువంటి కంఠనాళకేంద్రంలో
భావానికి భాష, మనస్సుకు వాచ్యం ఏర్పడుతుంది.

హృదయస్థానంలో స్పందన అనుభూతి పొంది
విచిత్రమైన నూతన కార్యోన్మీలన ఏర్పడుతుంది
అమృతభావాలు భౌతిక పరిధిని దాటిపోతాయి
అమరప్రాపంచిక ప్రపంచ బంధాలను త్రెంచివేస్తాయి.
అన్నిటికీ దివ్యత్వం ఆధార మవుతుంది
అన్నిటిలోను, సత్యం, రేఖా మాత్రంగా కనుపించి
ఈ లోకపుపునర్వ్యవస్థీకరణకు సహకరిస్తుంది.

ప్రతిరూపంలోను అతీంద్రియజ్ఞానసంకేతమే
ప్రతిదాని నిర్మితి వెనుకనున్నది పరబ్రహ్మలక్ష్యమే;

ఆ మహత్తర భావనలోని కళాచమత్కృతి
జగన్మాత పరమలక్ష్యానికి అనుగుణంగా
మన జీవన విన్యాణంలోని అపకృతులు, అపశృతులు
పరమాత్మ ప్రశాంత ఆధిపత్యం క్రిందికే వస్తాయి.

అవి ఒకనాటి వాంఛల అవసరాల సమ్మేళనం.
అవి ఆనాడు మేధ అవక్రపరాక్రమానికి తలవంచినవి.

ఇప్పుడు జీవితం ఒక దివ్యసూత్రానికి నిబద్ధమైంది
ప్రతిచర్య పరమాత్మ చర్యగానే పరిణమిస్తుంది
హృదయపద్మం అనే మహాసామ్రాజ్యంలో
ప్రేమ స్వచ్ఛందంగా, మధురగీతాలాలపిస్తుంది
పవిత్రమైన సంతోషానికి జీవం, శరీరం ఫలకాలు
ప్రేమలు, ఉద్రేకాలు అన్నీ పరమాత్మ కైంకర్యాలు—

నాభి కమలంలోని సువిశాలక్షేత్రంలో సహజమైన
అతిశయాలు, అహంకారాలు, వ్యామోహాలు,
అన్నీ మహత్తర ప్రశాంతిలో సమసిపోయి
ప్రపంచంలో పరమాత్మ కార్యాన్ని నిర్వహిస్తాయి.
సంకుచితమైన ఆ కేంద్రంలోని అన్నిభాగాలలో
సుఖ భోగ లాలసలు నిత్యం తలెత్తుతూ
అదే మహత్తరమైన మధుర జీవనం అవుతుంది.
కాలాన్నిబట్టి క్షుద్రశక్తులు విజృంభిస్తాయి.

ఆ క్రింది మర్మస్థానంలో మహాసర్పం నిద్రిస్తుంది
దానికి భౌతిక శక్తులపైన పూర్తిఆధిపత్యం వుంది.
క్షణికమైన జీవితంలో అక్షయ సుఖలాలసలవి
పరబ్రహ్మశక్తి దిగిరావడానికి భూమిక సిద్ధమైంది
అన్నిటి వెనుక అమరమైన ఆత్మ సంచరిస్తుంది.
అజ్ఞానపు ఆచ్ఛాదనను ఆవలకు త్రోసివేసి
క్షుద్రశక్తులకు, సృష్టిలోని జీవులకు, శక్తులకు లోబడి
మానవ స్థాయిలో అనురాగం పెంచుకోడం జరిగింది.

ఆ జగన్మాతకు సంపూర్ణంగా ఆత్మసమర్పణ చేసుకుంటే
ఈ అజ్ఞాన ప్రపంచపు అయోమయస్థితినుండి
ఆమె ఒక్కరే మానవుని జీవుని రక్షించగలిగేది.
జగత్తులో సర్వానికి ఆధారభూతమైన ఆత్మరహస్యంగా
మన అజ్ఞాన జీవితాన్ని నడిపిస్తుంది, శాసిస్తుంది
పరమాత్మలక్ష్యం, ప్రకృతిధర్మం అందులోనే వున్నాయి.

ఒక్కసారి ఆ రహస్యద్వారాలు తెరుచుకున్నట్లయితే
నిగూఢంగావున్న పరమాత్మ ప్రకృతి రంగంలోకి వస్తాడు
ఈ అంధకారంలోకి ఒక తేజస్సు ప్రవేశిస్తుంది
జటిలంగా, అగమ్యంగా వున్న ముడి వదులవుతుంది
మనసు జీవుని అధీనంలోకి వస్తుంది
జీవితం ఆత్మ శాసించినట్లు నడుచుకుంటుంది.
అప్పుడంతా జ్ఞానమయమే, బ్రహ్మానందమయమే.

ఒకానొకదివ్యశక్తి ప్రకృతి స్థానాన్ని ఆక్రమిస్తుంది
మన శరీరాన్ని, మనస్సును అదే నడిపిస్తుంది
మన ఆశయాలకు, కలలకు అదే కాణాచి
మన ఆలోచనలకు క్రియలకు అదే పట్టుగొమ్మ.

ఆమె తన మహత్తరశక్తిని మనలోకి పంపుతుంది
భౌతిక శరీరంలోనే అలౌకిక బ్రహ్మానందం కలుగుతుంది
ఒక అంతర సౌందర్యసూత్రం మానవజీవితాన్ని రూపుదిద్దుతుంది
మన పలుకులన్నీ సహజ సత్య ప్రవచనాలవుతాయి.
ప్రతిభావం తేజోసాగరంపైని ఒక నురగ
పాపపుణ్యాలు రోదసి అంచుల్ని దాటిపోతాయి
అవి మన హృదయాలలో దాగుడుమూతలాడవు.

మనంచేసే పనులన్నీ పరమాత్మ సంకల్పాలే
ప్రతిక్రియను భగవత్కార్యంగానే భావిస్తాము
పాపం, అసత్యం, అయిష్టం అయిన భావనలు, ప్రేరణలు
కకావికలమై, స్థానాలను కోల్పోతాయి.

మనసులోని మరపు పొరలలో అవి సిగ్గుతో దాగివుంటాయి
అప్పుడే మనస్సు ఒక విజయశంఖం పూరిసుంది.

''ఓ, ఆత్మా! స్వర్గాన్ని సృష్టించింది మేము
మాలోనే పరమాత్మ సామ్రాజ్యాన్ని దర్శించగలం
అజ్ఞానప్రపంచంలోనే ఆ కోటను నిర్మించుకున్నాం
రెండు కాంతి ప్రవాహాలమధ్య మా జీవితం చిక్కుకున్నది
మేము ఈ రోదసిని శాంతిసాగరంగా మార్చివేశాం
ఈ శరీరాన్ని బ్రహ్మానందానికి ఆధారంచేశాం
ఇంకా ఏమేమి కావాలన్నా, అంతా చేసుకోడానికి సిద్ధం''

క్రమంగా, నెమ్మదిగా పరిణామం చెందుతున్న జీవుడు
మృత్యువుకీ, జన్మకు మధ్యగల స్వల్ప విరామంలో
కడకు సంపూర్ణ సమగ్రస్థితిని చేరడం జరుగుతుంది.
మన స్వభావాలు ఎంత కఠినమైనా, నిరుపయోగమైనా
ఇదే దేవతలకు ఆవాసయోగ్యమైన మందిరం.
కల్లోల కశ్మల ప్రపంచాన్ని బయటనే వదలిపెట్టినా
ఒకవ్యక్తి సంపూర్ణత్వం జగత్తునే ఉద్ధరిస్తుంది.

ఆకాశానికి కొత్త బాటలు ఏర్పడ్డాయి
తొలిసారిగా భువికి దివితో సంధానం ఏర్పడ్డది
సత్యానికి జీవితానికి అనుసంధానం సాధ్యమైంది
మానవ జీవనంలో పరబ్రహ్మస్థానం ఏర్పడ్డది.

